# ముందుమాట

క్రొంచెం తటపటాయిస్తూనే నేనీ చిన్న పుస్తకాన్ని వెలుగులోనికి తీసుకు వచ్చాను. పాఠకు లనుకున్నట్లు గాంధీగారి ఆర్థిక సూత్రాల సమర్థన కావాలనే చేశాను. మనం గాంధీవాదంలో రంధ్రాన్వేషణచేసేముందు దానిని ప్రజాసామాన్యం ముందు వుంచవలసినంత బాగా వుంచాలి. గాంధీగారి రాతల్లో సర్వసాధారణంగా కనపడే అశాస్త్రీయమైన పదజాలాన్నిగానీ, అవకతవకలనుగానీ మనం గోరంతను కొండంత చెయ్యకూడదు. వాటిల్లో అంతర్లీనమైన వైదికమత వాతావరణం యెడల మన కున్న అసహ్యాతను అతిక్రమించి శాస్త్రకారుని కుండే నిర్లిప్తితోనూ, నిష్పాంగత్యంతోనూ గాంధీవాదంయొక్క లోతులు తరచాలి.గాంధీగారి రచనలనుగూర్చి అనుకూల్యంగానీ, ప్రాతికూల్యంగానీ ఇంకా అవి ఆవేకపూరిత మగు స్థితిలోనే వున్నవి. ఇది సమకాలికవాదా లన్నిటికీ వచ్చే దుస్థితి.

సనాతన మార్క్సిజమ్ నూటికి నూరు పాళ్ళు శాస్త్రీయమైనదా అనే విషయంలో నాకు గలిగిన సందేహాలే గాంధీవాదపునఃపరిశీలనకు నన్ను ప్రేరేపించినవి. దీన్నింతమాత్రాన మార్క్సుమీదగానీ, మార్క్సిజమ్ మీదగానీ నేను కళంకం ఆరోపిస్తున్నానని ఎవరూ భావించకూడదు. మార్క్సిజమ్ కన్న యిటీవల వచ్చిన తత్వశాస్త్రాలు చాలా విపరీతమైన తర్జనభర్జనలకు లోనై ఈ కాలానికి పనికిరాకుండాపోయినై. సాంఘికసమస్యలను గూర్చిన సమాలోచన శీఘ్రగమనం చేస్తోందని దీనివల్ల తేలుతోంది. అలాంటప్పుడు మనం చెయ్యాలిసిన పనేమిటంటే కొన్నింటిని చిరంతనసత్యములుగాస్వీకరించి నూత్నసత్యగ్రహణానికి మనమనఃకవాటాలను తెరచివుంచాలి. సామాజికవాదం ప్రతిపాదించే ప్రాతిపదికసిద్ధాంతాల్ని నేను వెనకముందాడకుండా ఆమోదిస్తున్నాను. కాని వుత్పత్తిశక్తుల్లోనూ, సామాజాంతర్గతవర్గ సంబంధాలలోనూ మార్పురావటంచేతనూ, సాంఘికశాస్త్రాలనుగూర్చిన మన జ్ఞానం యిటీవల పెరుగుటచేతనూ నేను మార్క్సిజమ్‌యొక్క విలువను తిరిగి కట్టడానికి పూనుకున్నాను.

ఉత్పత్తిశాస్త్రం పెరగడం, నిరుద్యోగం పెరగడం, ప్రభుత్వం ప్రజల నణచాలనీ, ప్రజలు దానిని ప్రతిఘటించాలనీ చూడడం మొదలైన ముఖ్యవిషయములు మార్క్సుయొక్క సునిశిత మగు దూరదృష్టికికూడా అందలేదు. ఈ రెండు ప్రధానాంశాలూ సామాజిక హోమగుండంలోనుండి యిటీవల బైలువెడలినవి. సమత్వం

స్థాపించబడిన సమాజం, అందుకోసం మన మవలంబించే సాధనలు— ఈ రెం టినీ మనం తప్పనిసరిగా పునః విమర్శించాల్సివచ్చింది. ఈ వ్యాసంలో మొదటి దాన్నిగూర్చే మనం ఎక్కువగా ఆలోచిస్తున్నాం. రెండవదాని ప్రభావంకూడా మన వాదంలో పడింది. ప్రస్తుత వ్యాసానికి అంతగా సంబంధించని పీటర్ డ్రకర్ పిలిచి నట్లు ఆర్థిక మానవుని అంతము మూడవ ప్రధానాంశమై యున్నది. పెట్టుబడిదారీ విధానము సర్వతోముఖవికాసాన్ని పొందిన యుగంలో ఆర్థికవిషయాన్నిగూర్చి నొక్కివక్కాణించటంలో ఔచిత్య ముంది. కాని పెట్టుబడిదారీవిధానానికి ప్రధాన మైన వ్యక్తిగతవ్యాపారం, వ్యక్తిగతలాభం బాగాతగ్గిపోయిన యుగంలో ఆర్థికనియ మాలనుమాత్రమే విచారించుట కొంచెం తగ్గాలి ఈనాటినుండి మానవులు భౌతి కేతర, ఆర్థికేతర విషయములకే ప్రగాఢంగా, నిర్నిరోధంగా చరిస్తారనడం సంభావ్యమైనదే. నేడు గాంధీగారు అట్టి విషయాలకే ప్రతినిధిగా నిలబడ్డాడు.

పారిశ్రామికవిప్లవం తీసుకువచ్చిన యుగానికి ప్రవక్త మార్క్సు. ఫాసిజమ్ నియంతృత్వయుగానికి ప్రవక్త గాంధీ. మొదటియుగంలో పదార్థాలకొరత ప్రధాన సమస్యమై యున్నది. రెండవ యుగంలో నిరుద్యోగం ప్రధానసమస్య. మార్క్సు యంత్రములను సమాజపరం చెయ్యాలని సూచించాడు. గాంధీజీ యంత్రము సులభ తరము చెయ్యబడాలని అంటున్నాడు. పైశాచికయంత్రాలను వుంచినట్లయితే వాటిని నడపటానికి గొప్పగొప్ప ప్రవీణులూ, టెక్నీషియన్లు కావాలి. మనమంతా వాళ్ళమీద ఆధారపడవలసియుంటుంది. నేటి పెట్టుబడిదారుని బదులు రేపటి పారి శ్రామికప్రభుత్వనిర్వాహకులు పరిపాలకులుగా తయారౌతారు. ఉత్పత్తిసాధనాలు సమాజపరం చెయ్యబడటంతో ఆస్తియొక్క న్యాయబద్ధమైన హక్కు కార్మికుల చేతుల్లోకి వెళ్ళటం నిజమే. కాని ఆ యంత్రముల పరిమాణం ఫ్యాక్టరీ మేనేజరుకు సంపూర్ణమైన అధికారాన్ని కల్పిస్తోంది.

సమాజముయొక్క సాంఘిక-రాజకీయ రూపం దాని ఆర్థికనిర్మాణానికి ప్రతి బింబమన్నమాట నిజమైనచో యంత్రపరిశ్రమమీద ఆధారపడిన, ఆర్థికనిర్మాణం కలిగిన సమాజం వుద్యోగులతో నిర్మింపబడే ప్రభుత్వాన్నిమాత్రమే కలిగివుం టుంది. ఇది తప్పనిసరివిషయం. పెట్టుబడిదారీవిధానం నిర్మూలించబడినా రష్యాలో జరిగింది దీనికి మంచి వుదాహరణం. రష్యావిప్లవం సామాన్యమానవునకు అధిక స్వాతంత్రం ఇచ్చే సంఘాన్ని కల్పించకుండా బూర్జువాసంఘానికన్నా ఎక్కువ స్వాతంత్ర్యాన్ని హరించే సమాజాన్ని సృష్టించింది. సోవియట్ రష్యాలో కమ్యూ నిష్టుపార్టీవినా మరొకపార్టీ చట్టబద్ధంగా పనిచెయ్యటానికి వీలులేదు. ఈ స్వాతంత్ర్య

హరణానికి స్టాలిన్‌ను నింధించటం వివేకమైనదికాదు. ఈ విషమపరిస్థితి దాటగానే ప్రస్తుత నియంతృత్వపరిపాలన సడలడం మనం చూడవచ్చును. కాని పెద్దపెద్ద యంత్రాలమీద ఆధారపడిన సంఘంలో ప్రవీణుల నియంతృత్వం అది ఎంత మంచిదైనా తప్పనిసరిగా వస్తుంది. సోవియట్ రష్యాలో ప్రభుత్వయంత్రం క్రమంగా సంకోచమవడానికి బదులు అధికంగా విస్తరించబడి బరన్‌హామ్ చెప్పినట్లు కొలది మంది వుద్యోగనిర్వాకుల చేతుల్లోకి వచ్చింది.

పెట్టుబడిదారీవిధానానికి ప్రత్యామ్నాయంగా వుద్యోగనిర్వాహకుల ప్రభుత్వం తప్పనిసరిగా వస్తుందని బరణాహామ్ భావిస్తున్నాడు. కాని మరొక ప్రత్యామ్నాయాన్ని సూచించవలసిన సమర్థుడు కావలసియున్నాడు. ఉత్పత్తిసాధనాలు సులభతరం చేయబడి సామాన్యమానవుడు వాటిని వాడగలిగి వ్యష్టిగానో, సమిష్టిగానో వాటిమీద హక్కు చలాయించే ప్రత్యామ్నాయసమాజం రావాల్సియుంటుంది. అట్టి సమాజానికికూడా పరిశోధకపండితులు, ప్రవీణులైనసాంకేతికశాస్త్రజ్ఞులు అవసరం. కాని వారికి పరిపాలకవర్గపాత్రను ఆ సమాజం వహించనివ్వదు. ప్రభుత్వయంత్రి వ్యాకోచమయ్యే పరిస్థితులు కల్పించబడే సమాజం యిదొక్కటే.

నే నీ వాదనను బైలుదేరనీయడంలో చాల సాహసంచేస్తున్నానని నాకు తెలుసు. ఈ వాదనాసమర్థనలో నా కున్న శక్తిసామర్థ్యాలుకూడా నాకు తెలుసు, గత రెండు మూడు సంవత్సరాలనుండీ నా మనసులో వలుగుతున్నదానికి అనుగుణ్యంగా వుండే భావపరంపర పెక్కుండుప్రిప్రాచ్య పాశ్చాత్య తాత్వికుల రచనలలో నాకుకనపడింది. ఆ మిత్రులనుండి నాకు గణనీయమైన సహాయం లేకపోతే నే నేమీ రాయాలేను. ప్రచురించాలేను. శ్రీ కిశోర్‌లాల్ మశ్రువాలాగారూ, శ్రీ వైకుంఠ మెహతాగారు ఈ వ్రాత ప్రతిని దయతో శ్రద్ధగా పరిశీలించారు. వారినుండి అమూల్యమైన సూచనలను నేను పొందాను. నాసికరోడ్డుకేంద్ర నిర్బంధశిబిరంలో ఆచార్య భగవత్‌గారూ, ఇంకా పెక్కుండుప్రి మిత్రులు నా యీ పూనికకు చాలా సానుభూతి చూపించారు. వీరందరికీ నా కృతజ్ఞతాపూర్వక వందనాలులు.

దంతవాలా

# అనువాదకుని విజ్ఞప్తి

ఆచార్య యమ్. యల్. దంతవాలాగారు రచించిన ఈచిన్ని వ్యాసము భావగర్భితమై పటుతరవాద సంభరితమై పఠితల ఆలోచనల రేపునదిగవున్నది. నేడు మనదేశమందలి విద్యార్థికులను, మేధావులనూ, కలవరపరచు సమస్య లనేకములున్నవి. వర్తమానయుగము ప్రతి వ్యక్తిలోనూ స్పర్ధ, సంఘర్షణలను ప్రకోపము చేస్తున్నది. ఆధ్యాత్మిక వాదము, భౌతికవాదము, అహింస, హింస, సామ్రాజ్యవాదము, సామాజికవాదము, నియంతృత్వము, ప్రజాస్వామికము మొదలగునవి పెక్కులు మనలను డోలాయమానులుగా చేస్తున్నవి. పూరా వ్యవస్థలయెడల గౌరవభావము నశించినది. వాని పూర్తి అవసరముకూడ వాస్తవముగ లేదు. సరిక్రొత్త సమాజనిర్మాణముకోసము అభ్యుదయాన్ని కాంక్షించే పురోగాములైన తరుణమేధావులు తహతహలాడుతున్నారు నేడే మనం సంధియుగంలో వున్నాము. సాహిత్యం, శిల్పం, రాజకీయార్థికములలో,— ఒకటేమిటి సమస్త మానవజీవన శాఖలలోనూ ఒక అపూర్వవిప్లవంవచ్చి భూలోకము నందనవనము కావాలని మనమారాటపడుచున్నాము. చివికి జీర్ణించి శిథిలమయిపోయిన అప్రాచీన వ్యవస్థావిధ్వంసానంతరము నూత్నయుగోదయము శుభారంభం కావాలని మనం వాంఛిస్తున్నాం.

భవితవ్య సౌభాగ్య నిర్మాణానికి పురావ్యవస్థల పూర్ణవిధ్వంసం అక్కర లేదని మా విశ్వాసము. ప్రాచీనసంస్థలలోని చిరంతన సత్యాలను కొన్నిటి నాధారముచేసుకొని భవిష్యద్భారతవర్షం నిర్మాణముకావాలని మేము కోరుతున్నాం. గాంధీవాదం చేసేపనియిదియే. "సామాజిక కళ్యాణము" అనే పదానికి మనము చెప్పుకొనే అర్థముగోవుంచి. మన ఆదర్శాలరోను తత్సాధనకై మనం అవలంబించే పద్ధతులలోనుకల, తేడా ద్వితీయపురుషార్థసాధనం ఒక్కటే, మానవకోటి సమస్యలను పరిష్కరింపజాలదు. ప్రస్తుతం మనకు గోచరమయ్యే ఆర్థికనిమ్నోన్నతాలు, దారిద్ర్యం, నిరుద్యోగం, ఆకలిబాధ పూర్తిగ నిర్మూలము కావలసిందే. అవి అలాగే వుండాలని ఏ మూర్ఖుడూ కోరడు, మహాపురుషులందరు వాటిని గూర్చియే ఆలోచించారు. ద్వేషం, హింస పరస్పర అవిశ్వాసాలతోకూడిన మానవ సంఘానికి బాపూజీ ఒక దివ్యసందేశమిస్తున్నాడు. విజాతీయవాదాలను మానసికంగా బానిసలైపోయిన శిక్కందువి ఆ సందేశంలోని సౌందర్యాన్ని

గ్రహించలేకుండావున్నారు. ఆచార్య దంతవాలాగారినిబోలిన సుప్రసిద్ధులు గాంధీ వాదామును ఆధునిక వాదముతోపోల్చి, దానివిలువను కట్టడానికి పూనుకోవడం ముదావహం. ఈకార్యాన్ని ఆయన ప్రతిభావంతంగా నిర్వహించారు. మూలంలో వున్న సొగసు అనువాదంలో తప్పకుండా పోతుంది. భావములందలి ప్రౌఢిమ, భాషయందలి బిగువు మా అనువాదకార్యమును కష్టతరం చేశాయి.

ఆంగ్లభాషాభిజ్ఞులు తప్పకుండా, మూలం చదువవలసిందని మేము కోరుచున్నాం. యిట్టిగ్రంథాలు నేడు చాల అవసరం. మా అనువాదం పాఠకునిలో మూలగ్రంథపఠనను ప్రేరేపిస్తే మేము ధన్యులమని భావించుకొంటాము.

బెజవాడ
4—7—44

మైనేని రామకోటయ్య.

"పెట్టుబడి శ్రామికులకయ్యే ఖర్చుదేశంలో ఏర్పడ్డ పదార్థాల కొరత మీద, శ్రామిక కర్మాగారం యొక్క పరిమాణం, దానిలో వాడబడే యంత్రముల పరిమితిమీద ఆధారపడివుంటుంది. ప్రస్తుత పరిస్థితులను బట్టి ఎక్కువ శ్రామిక శక్తిని వుపయోగించి తక్కువ పెట్టుబడి పెట్టడం చైనాలో లాభదాయకం. మనమిచ్చే కార్మిక వేతనాల దామాషా దేశీయ విపణిశాలలో కొనుగోలు శక్తిని వృద్ధిజేయడం చాలా ప్రాముఖ్యత వహించాల్సిన విషయం" 'చైనా ప్రజాస్వామ్యంకోసం నిర్మాణం సాగిస్తోంది' అను పుస్తకంలో నుండి.

"భారత దేశంలో కావలసినంతమంది శ్రామికులున్నారు. కాని పెట్టుబడి శక్తి తక్కువైనది. భూములు, భవంతులు కలసిన పెట్టుబడికి నికరోత్పత్తికీ మధ్య దామాషా ఎక్కువగానున్న పద్ధతిలో మనం భారత దేశంలో పరిశ్రమలను స్థాపించి నిర్మించాలి" 'భారతదేశ ఆర్థికాభివృద్ధికి ఒక పథకం' అనే పుస్తకం నుండి.

ఒక దృఢతరమైన ఆర్థిక విధానాన్ని మహాత్మాగాంధీ ప్రతిపాదిస్తున్నాడని చెప్పడం ఈ వ్యాసంయొక్క వుద్దేశంకాదు. గాంధిజీ ప్రధానంగా ఒక తాత్వికుడుగాని సిద్ధాంతికాడు. ఆర్థిక విషయములలో బహుళమైన ఆయన ఆలోచనా విధానమందు సూత్రప్రాయంగావుండే అంశములు గోచరమగుతవి. కాని ఆయన తన ఆలోచనలను ఒక సిద్ధాంతరూపేణా వుంచలేదు. ఆయన ఆచార్యుడుకాడు. ఉపదేశికుడు మాత్రమే. అందువలన సమస్త సమస్యావివరణలో ఆయన భాష మతబోధ పరిభాషవలె వుంటుంది; గాని పాఠశాలల్లో, విశ్వవిద్యాలయాల్లో వుపయోగించబడే భాషలాగా వుండదు. దీనిలో ఒక గుణమున్నది. ఒక అవగుణమూవున్నది. విశ్వవిద్యాలయాల్లో వాడే భాషబొత్తిగా అయోమయంగాఉండే భారత ప్రజాసామాన్యానికి అగమ్యగోచరంగా వుంటుంది. విద్యాధికులు ఈ భాషయొక్క అపరిణతత్వానికి భుజాస్ఫాలనచేసి అభివృద్ధినిరోధకుడని, వుపద్రవకారి అని నిరసిస్తారు. గాంధీగారి భావాలు కొందరిలో భక్తిపూర్వకమైన ప్రశంసను, మరికొందరిలో క్రోధోద్రిక్తమైననిరసనను ప్రేరేపిస్తాయి. ఆయన భావాల యెడల ఆవేశపూరిత ప్రతీఘాతమునేగాక శాస్త్రీయ విచారణతో పరిశీలిద్దామనే ఈ వ్యాసంయొక్క వుద్దేశం. ఆయన భావాల్ని ఈ దిగువ ఉపశీర్షికల క్రింద విచారించటం సుకరం.

(1) పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకత.
(2) యంత్రములకు వ్యతిరేకత.
(3) యంత్రేతరములైన దోపిడి విధానం యెడల నిర్లక్ష్యం.
(4) ధర్మకర్తృత్వ సిద్ధాంతము.
(5) అహింసాపూరిత సంఘంయొక్క ఆర్థిక నిర్మాణం.

(1) పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకత:—వర్తమాన యుగంలో అమలులోవున్న ఆర్థిక విధానాన్ని గాంధీజీ మెచ్చుకోడనే విషయం అందరూ వప్పుకున్నదే దాన్ని మార్చాలని ఆయన గాఢంగా వాంఛిస్తూఉంటాడు. ప్రస్తుత ఆర్థిక విధానంపట్ల తన యొక్క అసమ్మతిని ఆయన అనేకసార్లు అసందిగ్ధమగు భాషలో ప్రకటించాడు. ఆయన వ్రాతల్లో,

వ్యవస్థాల్లో భారత ప్రజాబాహుళ్యంయొక్క దారిద్ర్య నిరుద్యోగములు ఇతి వృత్తములుగా కనపడుతవి. ధనవంతులు తమ ఆస్తిహక్కులను, స్వామ్యములను త్యజించవలసినదని ఆయన నిరంతరము విజ్ఞప్తి చేస్తున్నాడు. స్వదేశ సంస్థానాధిపతులను గూడ తమ పైశాచిక నిరంకుశత్వ పాపమును తుడిచివేసి, మానవత్వమున్న ప్రతివారికీ లేని అధికారములను వదులు కోవలసిందని ఆయన పదేపదే అడుగుతున్నాడు. ఆయన స్వయంగా నేను దరిద్రనారాయణుని ప్రతినిధినని చెప్పుకుంటున్నాడు. ఏడులక్షల గ్రామాదులలో అర్ధాకలితో కృంగి కృశించే మూకప్రజాసామాన్యానికి కాంగ్రెసు సంస్థ ప్రాతినిధ్యం వహిస్తుందని ఆయన రౌండుటేబుల్ కాన్ఫరెన్సులో చెప్పాడు. రక్షణార్హమైన ప్రతివర్గ ప్రయోజనమూ ఈ పై ప్రయోజనములను సాధించునదిగా వుండవలెను. వాస్తవమైన సంఘర్షణ యుద్భవిల్లినపుడు ఈమూకప్రజాసామాన్య స్వామ్యరక్షణకొరకు కాంగ్రెసు సర్వస్వం త్యాగంచేస్తుందని ఆయన చెప్పాడు. పదునాలుగు అంశములతో గూడిన నిర్మాణ కార్యక్రమంలో ఆయన ఆర్థిక సమానత్వం ప్రతిపాదించాడు "టానీ" చెప్పినట్లు పెట్టుబడిదారీ సమాజం నిమ్నోన్నతాలను బోధించినట్లయితే గాంధీజీ అట్టి విధానాన్ని హర్షించడనియనము చెప్పవచ్చును. నిర్మాణకార్యక్రమాన్ని గురించి వ్రాస్తూ "ఆర్థిక సమానత్వమనే పునాదిమీద ఈ కార్యక్రమం నిర్మించబడకపోతే అది ఇసుకమీద కట్టిన ఇల్లు వంటిది" అని అన్నాడు. వ్యష్టి ఆస్థినిగురించి ఆయన అభిప్రాయాలు ప్రస్తుత ఆర్థిక విధానం యెడల ఆయన దృక్కోణాన్ని స్పష్టీకరిస్తాయి. ధర్మకర్తృత్వ సిద్ధాంతమును గురించి వివరిస్తూ 'అది వ్యక్తిగతమగు హక్కులకు, స్వత్వములకు పూర్తిగా విరుద్ధమని మేము మరియొకచోట వాదించాము. అఖిలభారత చరఖాసంఘం, అఖిలభారత గ్రామపరిశ్రమ సంఘం లాభంలేనుకోని పద్ధతిమీద నడపబడుచున్నవి. ఎక్కువ వస్తువులు అమ్మకమై అధికలాభాలు రావాలనే పెట్టుబడిదారుని యొక్క ధరల విధానాన్ని అవలంభించక, ఆ వుత్పత్తిదారులు గౌరవజీవనాన్ని గడిపే సిద్ధాంతాన్ని మాత్రమే ఆయన అవలంభించుచున్నాడు. అఖిలభారత

చరఖాసంఘంలోని వడుకువారికి కనీసపు వేతనము లుండవలెనని (అందు వలన ఖద్దరు అమ్మకానికి నష్టమైనాసరే) ఆయన నిర్ణయించుటలోనే యిది స్పష్టంగా కనబడుచున్నది. ఖద్దరు ప్రచారంలో పెట్టుబడిదారులు అవలంభించే చవుగ్గా కొనడం, ప్రియంగా అమ్మడం విధానాన్ని వ్యతిరే కిస్తున్నాడు. ఆర్థిక విషయములందు పెట్టుబడిదారీ విధానాన్ని వాంఛించే వారెవరూ భారత దేశం చరఖానే వాడాలని అనజాలరు.

అహమ్మదావాద్ మజూర్ మహాచండ్ ఆయన క్రింద పనిచేస్తూ వుంది. గుడ్డల పరిశ్రమ జాతీయపరం కావాలనటం వారి ఆశయాల్లో ఒకటి.

గాంధీజీ తన మధ్యయుగాల భావాల్తోనూ, యంత్రమంటే నిరసన తోనూ మాత్రమే పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకిగా వున్నాడు గాని, దోపిడివిధానమంటే ద్వేషంతోగానీ, సామాజిక న్యాయం కావాలనిగానీ ఆయన అనటంలేదని కొందరు వాదిస్తున్నారు. అది అభివృద్ధి నిరోధక మైనది. పెట్టుబడిదారీ విధానమువలన గలిగే దుష్ఫలితాలు యంత్రజన్య ములుకావు. యంత్రం సంపాదించే లాభాలు వ్యక్తులజేబుల్లోకి వెళ్లడం చేతనే ఈ దుష్ఫలితాలు కలుగుతున్నవి. సంఘక్షేమానికి విరుద్ధంగా యంత్రంవాడబడే విధానాన్ని నిర్మూలించండి. ఈ భూలోకం నందనవన మౌతుంది. నీళ్లు మంచివికాకపోతే నీళ్లతోపాటు పిల్లనుకూడా పార వెయ్యటం హ్రస్వదృష్టి. యంత్రమువలన కలిగే లాభాలను వదులుకోవడం అనాగరిక స్థితికి వెళ్లటమే. పరులకోసం బాధపడే గాంధీజీకి అది సంతోష కారణం అయితే అయివుండవచ్చు కాని మానవజీవితం యెడల సముచిత దృక్పథంవున్నవారికి అది ఆనంద దాయకముకాదు.

మార్క్సిస్టులవలె గాంధీజీ పెట్టుబడిదారీ విధానానికి తర్కబద్ధ మైన వ్యతిరేకత చూపించడములేదు. ఇది నిర్వివాదాంశము. మానవ చరిత్రను వ్యాఖ్యానంచేసి సామాజికవాదం తప్పక వస్తుందని చెప్పడానికి ఆయనకు ఏమీ నిర్ణీత సిద్ధాంతాలులేవు. అదనపు విలువ ప్రోగుపడడం

వివరించటానికి కూడా ఆయన ఏమీసిద్ధాంతాలను అనుసరించటంలేదు. మార్క్సిష్టులు వుపయోగించే హేతువాదాన్ని చేపట్టకుండానే సామాజిక న్యాయాన్ని ప్రతిపాదించేభావాల్ని కలిగివుండడాన్కి ఎవరికీ ఎలాంటి ఆక్షేపణా వుండకూడదు.

కాని యిందువల్ల నీళ్లతోపాటు పిల్లను పారవెయ్యటం అనే ఆరోపణకు మనం జవాబు చెప్పినవాళ్లమవడంలేదు. గాంధిజీ యంత్రము లను తీవ్రముగా విమర్శిస్తున్నప్పటికీ ఆయన పూంజీ విధానవ్యతిరేకత యంత్ర వ్యతిరేకతవల్ల కలిగిందనడం అబద్ధం. గుడ్డలు కుట్టేయంత్రాన్ని, వుత్పత్తి చేసే కర్మాగారాన్నీ రైల్వేలను ఆయన ఒప్పుకున్నాడు. అవి ప్రభుత్వపరంగా వుండాలని ఆయన వాదిస్తున్నాడు. ఆయన నిర్మించుదా మనుకునే చరఖాసంఘములో కూడా పెట్టుబడిదారీ విధానములో వుండే వ్యాపారపుచొరవా మొదలైనవి వున్నవి. యంత్రరహితములైన పరిశ్ర మలు కూడా సామాజికోపయోగానికేగాని లాభానికి నడపవద్దంటున్నాడు. యంత్రము వున్నాలేకపోయినా గాంధీవిధానములో దోపిడీకి లాభానికి తావులేదు. పెట్టుబడిదారులన్యాయస్మృతికి ఆయన వ్యతిరేకి గనుకనే ఆయన పెట్టుబడిదారీ విధానికి ప్రతికూలిస్తున్నాడు. సంఘంలో న్యాయం వుండాలంటే పెట్టుబడిదారీ విధానపు సిద్ధాంతములు పనికిరావు. యంత్ర వ్యతిరేకతవలనే కాదు ఆయన పెట్టుబడిదారీ వ్యతిరేకియైనది.

(2) యంత్రములకు వ్యతిరేకత:— ఈ యంత్ర వ్యతి రేక భావమును గూర్చి ఏమిటి? అధునాతనమైన ఈ విధానానికి ఒక సనా తన హిందూనైతికంగానూ, విసర్గంగానూ చూపించే ప్రాతికూల్యమేనా? దోపిడీ విధానాన్ని మినహాయించినా, పాశ్చాత్య పారిశ్రామిక సంఘం, నీతి విరుద్ధమని ఆయన పరిగణించుటచేతనా?

గాంధీగారి రాతల్లోనూ, వుపన్యాసాల్లోనూ ఒక నీతికోవిదునిసనాత నత్వం కనపడుతూవుండడం యదార్థమే. ఆధునిక మానవులు మన దృక్ప థాన్నీ, నైతిక విశద్గతనూ అంతగా విశ్వసించరు. గాంధీగారు యంత్రం

యెడల వైరుధ్యాన్ని కనపరచడం ప్రథమంలో నీతిశాస్త్రమును, మత మును ఆధారముచేసుకొనియే. కాని మనలో చాలమంది అనుకునే సిసలైన ఆర్థిక కారణమును బట్టికాదు. ఒక మనిషియొక్క అంతఃదృష్టిని ఆర్థిక శాస్త్రజ్ఞుడు పరిహరించ నక్కరలేదు. శాస్త్రీయమైన దృక్పథంతో అతను దానిని విచారించవచ్చును. తరువాత గాంధీజీ వ్రాసిన వ్రాతల్లో యంత్రము లను యెక్కువగా వాడినందువల్ల కలిగే అనర్థాన్ని గురించి హేతుబద్ధమైన ఆర్థిక కారణాలను ఆయన చూపించాడు.

ఆయనయంత్ర వ్యతిరేకత సంపూర్ణమైనదీకాదు, విచక్షణా రహిత మైనదీకాదు. 'యంత్రముల పరిమితి' అనే పుస్తకంలో శ్రీయుత నరహరి పరీక్‌గారు ఈ విషయంమీద గాంధీజీ వ్రాతల నన్నిటినీ సంగ్రహించారు. ఆ గ్రంథ శీర్షిక సూచిస్తూన్నట్లుగా యంత్రములను హద్దుల్లో వుంచడమే గాని, యంత్రనిర్మూలంగాదు గాంధీగారు కోరేది. ఆయన మొదటవ్రాసిన వ్రాతల్లో యంత్రములకు పూర్తి వ్యతిరేకి అనే భావములు కొన్ని కనపడ తవి. 1908లో వ్రాయబడిన "హిందు స్వరాజ్య"అనే పుస్తకంలో ఆయన "యంత్రములో వుండేగుణము నాకు ఒకటీ కనిపించటంలేదు. కాని దాని అవగుణములను గూర్చి ఒక పుస్తకము వ్రాయగలను" అని వ్రాశాడు. ఇంకా ఏమివ్రాశాడంటే— "ప్రధాన సిద్ధాంతాన్ని గుర్తుంచుకోండి. యంత్రము ఒక సైతాను. దానిని మనం క్రమంగా నిర్మూలించాలి" కాని ఆయన తర్వాత వ్రాసిన వ్రాతల్లో ఆయన వ్యతిరేకత ఇంత అసందిగ్ధంగా కనిపించటంలేదు. పైగా ఆయన యంత్రవ్యతిరేకత విచక్షణా సహితమైన దనీ అధ్యాత్మ కారణాలను బట్టి కాక అనుష్ఠానయోగ్యమైన ఆర్థిక హేతువు లను పురస్కరించుకొనియె ఆయన యంత్రవ్యతిరేకతను ప్రదర్శిస్తున్నా డనీ, పెక్కు వుదాహరణలను చూపించవచ్చును.

ఆయన రాతల్లో నుండి ఈ క్రింది భాగములువుల్లేఖింపబడినవి. గాంధీజీ అన్నియంత్రములకు వ్యతిరేకికాదనే భాగాలను మేము వుల్లే ఖిస్తున్నాం.

"సమస్తములైన యంత్రములు కావాలనీ, నేను అందుకోసం పనిచేస్తున్నాననీ చెప్పడం నిజంకాదు" యంగ్ ఇండియా—19-1-1921.

"నేను అన్ని యంత్రములను వ్యతిరేకినని తెలియనివారు చాలా మంది చెప్పుతూ నా ప్రతిష్ఠకు కళంకం కలిగించారు."

నవజీవన్ 20-4-1924.

"నా వుద్దేశ్యం యంత్రనిర్మూలంకాదు. యంత్రమును హద్దుల్లో వుంచుటయే." యంగ్ ఇండియా 13-11-24.

"నేను యంత్రములకు అభ్యంతరం చెప్పటంలేదు. యంత్రముల కొరకు మానవకోటి చూపించే వున్మాదానికే నేను ప్రతికూలుణ్ణి. నాకు పనిచేసే కాలమూ శ్రమా తగ్గాలనే వుంది. కాని ఒక వర్గముయొక్క కాలమూ, శ్రమేకాకుండా సమస్త మానవకోటి యొక్క కాలమూ శ్రమా తగ్గాలని నేను కోరుతున్నాను." యంగ్ ఇండియా 13-11-1924.

"కుటీరముల్లో నివసించే కోట్లకొలది మానవుల భారాన్ని తగ్గించి, మానవశ్రమను తగ్గించే యంత్రాలకి నా జోహారు, నాసుస్వాగతము"

యంగ్ ఇండియా—17-6-1926.

"ప్రజాసామాన్యానికి పనిచేసి అవకాశము కల్పించకుండా వుండని యే యంత్రమునైనాసరే గ్రామపరిశ్రమ వుద్యమము కాపాడుతుంది. ఆ యంత్రము మనిషిని తన దాసుని చెయ్యకుండా తన సమర్ధతకు, సొంత వానికి తోడ్పడేదిగా వుండాలి. ప్రతిగ్రామకుటీరంలోనూ విద్యుచ్ఛక్తి వుంటే గ్రామస్థులు తన పనిముట్లను విద్యుచ్ఛక్తిసాయంతో నడుపుకోటానికి నేనేమీ అభ్యంతరపెట్టను" హరిజన్ 22-6-1935.

పై వుల్లేఖనములు గాంధిజీ సమస్త యంత్రములకూ వ్యతిరేకి కాదని స్పష్టముగా తెలుపుచున్నది. ఎలాంటి యంత్రాలు కావాలో, ఏ పరిస్థితుల్లో ఆయన వాటిని వప్పుకుంటాడో వాటిని గురించి మనం ఇప్పుడు పరిశీలిద్దాం. యంత్ర వ్యతిరేకతకు ఆయన హేతువులు తెలిపే భాగాల్ని కింద వుదహరిస్తున్నాం.

"యంత్రము మానవశ్రమను తగ్గిస్తుందికాని లక్షలకొలది మనుషులు దానివల్ల నిరుద్యోగులై ఆకలితో అల్లాడుతూ వీధులవెంట తిరుగుతారు."

యంగ్ ఇండియా 13-11-1924.

"కొద్దిమంది చేతుల్లో సంపదనూ, అధికారాన్నీ కేంద్రీకరించటం కోసం యంత్రాలను వుపయోగించటం అన్యాయమనీ, పాపమనీ నా అభిప్రాయం. ఈ రోజున యంత్రం ఇలా వుపయోగపడుతోంది."

నవజీవన్ 20-9-1925.

"కోట్లకొలదిమంది మనుష్యులు నిర్వ్యాపకులుగా వున్న దేశంలో మానవేతరమైన శక్తిని వుపయోగించడం ఆ నిరుద్యోగాన్ని ఇంకా ఎక్కువ చెయ్యడమే" హరిజన బంధు 29-10-1932.

"పని కావలసిన మనుషులు ఎక్కువగా వున్న దేశంలో యంత్రాలను వుపయోగించటం వుపద్రవకరమైన సంగతి"

హరిజనబంధు 18-11-1934.

"కోట్లకొలది మనుషులు నిరుద్యోగంతో సోమర్లుగా వున్నప్పుడు మానవశ్రమను తగ్గించేయంత్రాలు కావాలనడంలో సారాంశమేమున్నది ?"

హరిజనబంధు 19-11-1934

"భారతదేశంలోని ఏడులక్షల గ్రామాలలోవున్న జీవయంత్రాలకు బదులు, నిర్జీవయంత్రాలను మనం వుపయోగించకూడదు. మానవశ్రమను సులభీ కృతంచేసే యంత్రమే సరైనది. ఈ రోజున యంత్రము కొద్దిమంది జేబులు నింపడానికి మాత్రమే వుపయోగపడుతూన్నది. కొలది మనుష్యులుండి, వారి ఆహారాన్ని యంత్రం దాసేసిస్తుందనే విషయాన్ని చాల తక్కువమంది గ్రహిస్తున్నారు." హరిజనబంధు—15-9-1935.

"మూడుకోట్ల మందికి బదులు ముప్పైవేలమంది శ్రమతో నా దేశానికి కావలసినవస్తూత్పత్తి అయితే నా కేమీ అభ్యంతరంలేదు. కాని ఆ మూడు కోట్లమందీ నిర్వ్యాపారులుగానూ, సోమరులుగానూ తయారు చేయకూడదు." హరిజనబంధు 27-2-1938.

గాంధీగారి యంత్ర వ్యతిరేకతకు రెండు విభిన్న కారణములున్న వని తేలినది. (1) యంత్రములను పెట్టుబడిదారులు దోపిడీకొరకు ఉపయోగించుకొంటున్నారు. (2) పారిశ్రామిక నాగరికతలోనే ఈ రెండవకారణమే ప్రధానము. మొదటిది యంత్రోపయోగ విధానములోని అక్రమ పద్ధతిని సూచిస్తుంది. రెండవది ఒక ప్రధానమైన ప్రాతిపదిక సిద్ధాంతాన్ని చూచిస్తుంది. ప్రస్తుత ఆర్థిక విధానంలో యంత్రము ఉపయోగపడే పద్ధతినే ఆయన వ్యతిరేకించుటలేదు. యంత్రము యొక్క అపరిమితోపయోగము తానూహించే స్వేఛ్ఛాధర్మ సమన్వితమైన సంఘానికి విరుద్ధమని ఆయన నమ్ముతున్నాడు. ఈ రెండవ విశ్వాసమే ఆయనను ఒక అభివృద్ధి నిరోధకునిగా, శాస్త్రీయ దృక్పథంలేని వానినిగా ఇతరుల దృష్టిలో చేసింది.

మరొక దృక్పథంలో చూస్తే ఆయన అభ్యంతరాలను రెండుగా విభజించవచ్చును. (1) ఆర్థికమైనవి (2) సాంఘికమైనవి లేక సంఘజీవ శాస్త్రానికి సంబంధించినవి. తత్వశాస్త్రానికి సంబంధించినవి గాంధీగారున్ను, సామ్యవాదులున్ను యంత్రమును పెట్టుబడిదారులు ఉపయోగించే పద్ధతికి వ్యతిరేకులు కనుక ఆ విషయమును గురించి మనము ఎక్కువ చెప్పనక్కరలేదు. యంత్రమును మనము అపరిమితంగా ఉపయోగిస్తే మానవసంఘక్షేమానికి అది ఉపయోగిస్తుందా లేదా అనే దాంట్లో నేవుంది గాంధీవాదం యొక్క పస. కనుక మనం ఆర్థిక సంఘ జీవశాస్త్ర, తత్వశాస్త్రములకు సంబంధించిన యంత్రోపయోగాలయెడల వున్న అభ్యంతరాలను విచారిద్దాము. పెట్టుబడిదారీ విధానంలోవుండే యంత్రోపయోగంవల్ల గలిగే చెడులను ఇక్కడ వదలివేద్దాం.

ఆర్థికశాస్త్ర ఆక్షేపణలు:- వీటిని కొద్దిలో చెప్పాలంటే ఈ దిగువ సూచించిన విధంగా ప్రవర్తించాలి. జీవన ప్రమాణం పెరిగినప్పటికి, పనిచేసే గంటలు తగ్గినప్పటికి యంత్రముయొక్క ఉపయోనికి ఒక హద్దనేదిలేకపోతే యావత్తు జనానికి సరిపడే పని కల్పించబడదు. అంటే

యంత్రముయొక్క పూర్తి ఉపయోగాన్నిగానీ, పూర్తియగు మానవ పరిశ్రమనుగానీ మనము తగ్గించవలసి యుంటుందన్నమాట. ఈ ఆక్షేపణ ఎంతవరకు యదార్థమో మనం పరిశీలిద్దాం.

మిగతా విషయాలన్నీ సరిసమానంగావుంటే యంత్రోపయోగం నిర్వ్యాపారత్వాన్ని కలిగిస్తుంది. సనాతన ఆర్థికశాస్త్రజ్ఞులు, సామాజిక వాదులు, ఇతరవిషయాలు హెచ్చుతగ్గులులేకుండా వుండనవసరంలేదని చెబుతున్నారు. యంత్రోపయోగం, వస్తూత్పత్తి ధరలు తగ్గించి కొనుగోలును ఎక్కువచేయడం, అధికవాంఛ, అధికోత్పత్తి, ఇవన్నీ అధిక ఉద్యోగాలకు దారితీస్తుందని సనాతన ఆర్థిక శాస్త్రజ్ఞులు వాదిస్తున్నారు. యంత్రము ఉపయోగించబడిన పరిశ్రమలలో పనిచేసేవారి సంఖ్య తగ్గినచో ఇతర పరిశ్రమలలో వ్యాపారత్వము పెరుగును. పరిశ్రమాభివృద్ధితో ఉద్యోగాభివృద్ధి జరుగుతుందని లెఖ్కలవివరాలు తెలిసినవారు చెప్పడంలేదు. పారిశ్రామిక విప్లవానంతరం మొదటి పెరుగుదలదశలో నూత్నోత్పత్తి కార్యక్రమం పాత పరిశ్రమలలోనుండి వెలికివచ్చినవారికి పనికల్పించింది. భారీవుత్పత్తి కార్యక్రమ నిర్వహణతో వస్తూత్పత్తిధరలు తగ్గినదశ అది. పెరిగినయంత్రములతో సాధించబడే ఆంతరంగిక నిర్మాణమును, నూతన మార్గాలను పారిశ్రామికులు వెదకుదశ ఇప్పుడు వచ్చినదికనుక వుత్పత్తి పెరిగిన మాత్రమున వ్యాపారత్వము పెరుగదు.

ఒక ప్రక్కన దారిద్ర్యము, ఆకలిబాధ మరొక ప్రక్కన అధిక పని, ఘర్మజల స్రావము వున్న ఈ కాలంలో అధికోత్పత్తి నిర్వ్యాపారత్వమునకు దారి తీసిందని చెప్పడం బుద్ధితక్కువని సామాజిక వాదులు చెబుతున్నారు. నిరంతరం పెరిగే జీవన ప్రమాణం నిరంతరం తగ్గి పని చేయు గంటలు మనకెందుకుండ కూడదు? పనిచేసేకాలం తగ్గితే ప్రస్తుతం పనిచేసేవారికన్నా మూడురెట్ల మందికి పని కల్పించవచ్చు.

సంఘ జీవ శాస్త్రాభ్యంతరము:- దీన్ని లోతుగా పరిశీలిస్తే ఇది అర్థశాస్త్ర సమస్యగాదు. ఒక భాగం తత్వ శాస్త్రానికి, మరి

యొక కొంత భాగం సంఘ జీవశాస్త్రానికి సంబంధించి వుంటుంది. ప్రతి మనిషికి 5 మోటారు కార్లు, మూడు విమానాలు, 6 విలాసనావలు ఎందుకు వుండకూడదు. ఒక మనిషికి ఎన్ని భౌతిక వస్తువు లున్నవనేది సిసలైన అర్థశాస్త్ర ప్రశ్నగాదు. పనిచేసే కాలపరిమితి గంటకుగాని, గంటకు లోపుగాని, తగ్గిన మానవ సంఘాన్ని నీతి భ్రష్టం చేస్తుందనడం కూడా అర్థశాస్త్ర సమస్య, ప్రశ్నగాదు.

ఈ ప్రశ్నల విషయమై మేము చర్చకు దిగుట లేదు. భారత ప్రజా సామాన్యంలో వృత్తుల వారీగా 1931 వ సం॥ పు జనాభా లెక్కలు తీసుకొంటే ఉద్యోగానికి ఉత్పత్తికి మధ్యవున్న సంబంధం తెలుస్తుంది.

| | | |
|---|---|---|
| హిందూదేశములోని మొత్తం జనాభా | 352. 83 | మిలియన్లు |
| బ్రిటిషు ఇండియా జనాభా | 271. 52 | ,, |
| వృత్తులోని మనుష్యుల సంఖ్య | 168. 83 | ,, |
| అప్రధాన వృత్తుల్లో వున్నవార్ని వదిలేస్తే మిగతావారి సంఖ్య | 153. 92 | ,, |
| ఇందులో వ్యవసాయంలో వున్నవారి సంఖ్య | 103. 29 | ,, |
| ఖనిజములలో వున్నవారి సంఖ్య | . 34 | ,, |
| పారిశ్రామికుల సంఖ్య | 15. 35 | ,, |
| వర్తకుల సంఖ్య | 7. 91 | ,, |
| రవాణా శాఖలోవారి సంఖ్య | 2. 34 | ,, |
| పరిపాలన, కళల్లో వున్నవారి సంఖ్య | 4. 15 | ,, |
| గృహ కార్యములందు వున్నవారి సంఖ్య | 10. 9 | ,, |
| అనిశ్చయంగా వున్నవారు | 7. 78 | ,, |
| లాభం లేని పరిశ్రమల్లో వున్నవారు | 1. 63 | ,, |
| స్వంత ఆదాయాల మీద జీవించేవారు | . 22 | ,, |
| మొత్తం | 153. 92 | ,, |

353 మిలియన్ల జనాభాలో 170 మిలియన్లు మాత్రమే 15 కు పైన 55 కు లోపు వయస్సుగల్గి పనిచేసే ఈడులోవున్నారు. ఏ ఆర్థిక విధానంయొక్క ఆదర్శమైన, వీరందరికీ పనిచూపించేదిగా వుండాలి.

1931 సం॥ము జనాభా లెక్కల ప్రకారం వృత్తులలో నిమగ్నులైనవారి సంఖ్య 15 కోట్లకు తక్కువ. అనగా కనీసం రెండు కోట్ల మంది నిరుద్యోగులన్నమాట. ఒక మాదిరిగాగాని, తక్కువగాగాని పనిలో వున్న వారి సంఖ్య ఎక్కువ. వ్యవసాయమే దీనికి మంచి ఉదాహరణ. నూటికి 72 మంది అనగా 103 మిలియన్ల ప్రజలు వ్యవసాయంలో నిమగ్నమయి వున్నారు. భారతదేశ ఆర్థిక వ్యవహారాలు ఏ మాత్రం తెలిసిన విద్యార్థికి ఈ సంఖ్యలో చాలాభాగం అనవసరంగా వున్నారనే తెలుస్తుంది. భారతదేశంలో వ్యవసాయానికి పనికివచ్చే భూమి 300 మిలియన్ల యకరాలు. రైతువారీ పద్ధతిక్రింద ఈ భూమిని బాగా సాగుచేయటానికి 50 మి. ప్రజలు సరిపోతారు. సమిష్టి వ్యవసాయ విధానంలో యంత్రాలను ఉపయోగిస్తే ఇంకా చాలా తక్కువమందైనా సరిపోతారు. స్వరాజ్య ప్రభుత్వం క్రింద 70 మి. ఎక్కువ ప్రజకు వ్యవసాయేతర వృత్తులు మనం చూపించాలి. 1930,-40 మధ్య సం॥రాల్లో ఈ భాగంలోకి ఇంకా 20 మి. ఎక్కువ ప్రజవస్తుంది.

దీనికి ముందు పరిశ్రమ స్థాపనను సూచిస్తున్నారు. ఫాక్టరీ పద్ధతి మీద నిర్మించబడే పారిశ్రామిక పద్ధతిలో (అవి సమాజ పరం చేయబడ్డాసరే) జీవన ప్రమాణం పెరగటంచేత పనిచేసే కాలపరిమితి తగ్గటంచేత ఈ అదనపు జనానికి పనిచూపించలేమని మా భావన. బొంబాయి ఆర్థిక ప్రారిశ్రామిక సంఘమువారి నివేదిక మా వాదనను బలపరుస్తుంది. ఆ నివేదికలో ఇట్లున్నది. "భారతదేశంలో పారిశ్రామిక రాష్ట్రమైన బొంబాయి రాష్ట్రంలోనే ఇతరవృత్తుల్లో పనిచేసేవారి సంఖ్యకన్నా, పరిశ్రమల్లో పనిచేసేవారి సంఖ్య చాలా తగ్గింది. ఈ రాష్ట్రం పారిశ్రామికము చేయబడినందువల్ల వ్యవసాయకులకు రెండు కష్టములు సంప్రాప్తించినవి."

(1) భూమిమీద వత్తిడి ఎక్కువ ఆయినది. (2) సమాజ వృత్తులు నశించుటచేత నిరుద్యోగం ఎక్కువయింది।

పైని ఇవ్వబడిన ప్రామాణిక వచనాల ననుసరించి పరిశ్రమల వల్ల యంత్రములవల్ల నిరుద్యోగం తగ్గి భూమిమీది వత్తిడి తగ్గుతుందనుకోవడం కేవలం సాహసం.*

---

* బి. జి. ఘాటే గారువ్రాసిన 'జనాభాలో వృత్తివారీపంపిణీలో మార్పులు' అనే పుస్తకాన్నుండి ఈ క్రింది పట్టిక యివ్వబడింది. ఇది గవర్నమెంటు ఆఫ్ ఇండియా ప్రెస్సునందు ముద్రింపబడినది. ఈ పట్టిక పరిశ్రమల్లో నిమగ్నులైన మొత్తం మనుష్యుల పర్సంటేజీనీ లాభకరమైన వృత్తుల్లో వున్నవారి మొత్తపు సంఖ్యను తెలుపుతూవుంది.

| ఈ సంఖ్యకు సంబంధించిన దేశం, సం॥ | లాభకరవృత్తుల్లో మున్న మొత్తం జనాభా | పరిశ్రమల్లో వున్న మొత్తపు జనాభా | మొత్తము పనిచేసే వారిలో పరిశ్రమల్లో పనిచేసేవారిశాతము |
|---|---|---|---|
| అమెరికా | లక్షల్లో | లక్షల్లో | |
| 1910 | 328 | 107 | 27.9 |
| 1920 | 416 | 128 | 30.8 |
| 1930 | 488 | 141 | 28.9 |
| ఇంగ్లండు, వేల్సు | | | |
| 1911 | 163 | 69 | 42.1 |
| 1921 | 172 | 55 | 32.3 |
| 1931 | 189 | 60 | 31.7 |
| జర్మనీ | | | |
| 1925 | 320 | 122 | 38.1 |
| 1933 | 323 | 117 | 36.2 |
| జపాన | | | |
| 1920 | 273 | 53 | 19.4 |
| 1930 | 292 | 53 | 18.1 |
| కెనడా | | | |
| 1921 | 32 | 8 | 23.3 |
| 1931 | 39 | 7 | 17.3 |

పరిశ్రమల్లో పనిచేసే 15. 35 మిలియన్ల మనుషుల్లో 3. 5 మిలియన్ల మనుషులు యంత్రశక్తిని వాడి ఫ్యాక్టరీలలో పని చేస్తున్నారు. 1914 యుద్ధానంతరం భారత దేశంలో ఫ్యాక్టరీ పరిశ్రమలు అభివృద్ధి గాంచినవి. ఇనుము, ఉక్కు, వస్త్ర పరిశ్రమలు అదివరకే బాగా పెరిగినవి. వస్త్రోత్పత్తి నాల్గురెట్లు, ఇనుము ఉక్కు ఉత్పత్తి మూడురెట్లు పెరిగినవి ఈ కాలంలోనే పంచదార పరిశ్రమ ప్రారంభమై చాలా అభివృద్ధిలోకి వచ్చింది. సిమెంటు పరిశ్రమకూడా బాగా పెరిగింది. కాగితము రసాయనక పరిశ్రమలు బాగా అభివృద్ధి అవుతున్నవి. 1911-31 మధ్య రెండువేల ఏడువందల కర్మాగారాలల్లా తొమ్మిదివేల మూడువందలు అయినవి. కాని ఈ ముప్పయి సంవత్సరాల్లో ఫ్యాక్టరీల్లోను, ఫ్యాక్టరీలు లేని పరిశ్రమల్లోను పని చేసేవారి సంఖ్య 11 నుండి 9. 4 కు తగ్గినది. 1941 సం॥ పు మొత్తం జనాభాలో 4. 5% నుండి 4% వరకు తగ్గినవి.*

* రాధాకమలముఖర్జీ గారి "40 కోట్ల మందికి ఆహారం సమకూర్చే విధానం" అనే పుస్తకంలో నుంచి.

| | 1911 | 1921 | 1931 | 1941 | 1911-31మధ్య శాతములమార్పు |
|---|---|---|---|---|---|
| జనాభా పది లక్షల్లో | 315 | 319 | 353 | 389 | + 12.1 |
| పనిచేసేవారి సంఖ్య మిలియన్లలో | 149 | 146 | 154 | 170 | + 4.0 |
| పరిశ్రమల్లో వున్న వారిసంఖ్య మిలియన్లలో | 17.5 | 15.7 | 15.3 | 16.3 | – 12.6 |
| పనిచేసేవారి సంఖ్యలో పారిశ్రామికకార్మికులశాతము | 11.0 | 11.0 | 10.5 | 9.0 | – 9.1 |
| మొత్తపు జనాభాలో పారిశ్రామికకార్మికుల శాతము | 5.5 | 4.9 | 4.3 | 4.2 | – 21.8 |

పై లెక్కలు ఏం చెబుతున్నవంటే అధికోత్పత్తి అధికోద్యోగానికి దారితీయదనే సాంకేతిక భాషలో చెప్పాలంటే, ఉత్పత్తికి, ఉద్యోగానికి సామ్యం లేదన్నమాట. యంత్రముల శక్తివల్ల అధిక సంపదోత్పత్తికి తక్కువమంది మనుష్యులు సరిపోతున్నారు.

3. 5 మి. మందికి దీనివల్ల ఉద్యోగం దొరుకుతుంది. మా లెక్కల ప్రకారం భారత దేశంలో పనిలేని వారి సంఖ్య 70 మి. దేశాన్ని ప్రారిశ్రామికం చేసి 10 లేక 20 సం॥ ల్లో ఇంక అనేక మిలియన్లమందిపుడతారని మనం మరువకూడదు.

పరిశ్రమలు ఎక్కువయితే వర్తక, రహదారీ, గుమాస్తా పనులకు ఎక్కువమంది కావాలి. జీవన ప్రమాణం పెరిగితే ఎక్కువమంది ఉపాధ్యాయులు వైద్యులు కావాలి. స్వరాజ్యము, సామాజిక వాదము ఈ దేశానికి వచ్చే సమయానికి 140 మి. నిరుద్యోగుల్ని ఏంచేయాలి? వారిని మనం కనికరించాలి. యంత్రములకన్నా మానవహస్తములకే ఎక్కువ పని చూపించాలి.

యంత్రము మనిషికి సంపాదించిపెట్టే భోగాన్ని హాయిని వదులుకోమని మేము చెబుతున్నామంటే యంత్రము దాని హద్దులను దాటి మనిషిని నిర్వ్యాపారిగాను, నిరాహార కృశోదరునిగాను చేసి వేస్తుంది. గనుకనే పనిలేని 50 మి. మంది ఆకుక్కుతిన పలిసిందే. యంత్రమువారి కేమి హాయినివ్వ జాలదు. యంత్రము స్థానే వారే పనిచేయాలంటమే న్యాయము. శాస్త్రరీత్యా ఆలోచిస్తే యంత్రము బదులు మనిషిని ఉపయోగించడం అభివృద్ధి నిరోధకంగా పరిగణింపబడుతుంది. కాని మానవ క్షేమాన్ని దృష్టిలో పెట్టుకొంటే నిరుద్యోగులకు ఉద్యోగం కల్పించే ఈ విధానం అభివృద్ధి దాయకమని తేటతెల్లమవుతుంది.

ఉత్పత్తి సాధనాలను సమాజ పరంచేయడం తమాషాకాదు. ఉత్పత్తి శాస్త్రం మార్పు కూడా ఊహించనంత మార్పును పొందింది. సరిగ్గా నిర్వహిస్తే సమాజపరం చేసి ఆర్థిక దోపిడీని నివారిస్తుంది. గాంధీ అనుయాయులంతా దాన్ని ఆమోదించాలి. కాని సమాజపరం

చేసినంత మాత్రాన పూర్తి పని కల్పించబడదు. పనిచేసే గంటలు తగ్గి జీవన ప్రమాణం పెరిగినంత మాత్రాన పూర్తి ఉద్యోగం లభించదు. ఇది ఒప్పుకోవటానికి సిగ్గుపడ నవసరం లేదు. కొత్త జబ్బులకు కొత్త మందులు కావాలి. ఉత్పత్తి శాస్త్రం పెరిగినందు వల్ల సమాజపరం చేసినప్పటికి ఈ చెడు నివారింపబడదు. ఈ ఉత్పత్తి అభివృద్ధి యొక్క తాపిడి వల్ల మనం తప్పనిసరిగా స్వచ్ఛందంగా, హేతువాద బద్ధంగా, వివేకంగా యంత్ర పరిత్యాగం చేయాలి, ఈ రోజు కిది చాలా మంచిది. 20 వ శతాబ్దంలో మనిషికి యంత్రానికి మధ్య వున్న ప్రధాన సంఘర్షణను సమన్వయం చేసి క్రొత్తమార్గాలను మనుష్యుని మేధాశక్తి పరిష్కరించాలి. అది జరిగే వరకు మనుజునకే యంత్రము స్థానమివ్వాలి. దురదృష్టవశాత్తు చాలామంది బుర్రల్లో 19 వ శతాబ్ద భావాలుపోలేదు, యంత్రాభివృద్ధే మానవాభివృద్ధని వారు ఇంకా అనుకొంటున్నారు. తద్వ్యతిరేకవిశ్వాసములు ఇక్ష్వాకులనాటి వని అనుకొంటున్నారు.

ఆర్థికేతరములయిన కొన్నివిషయాలను గురించిమనము ఇక్కడ పరిశీలిద్దాము. యంత్రమువల్ల కార్మికునికిగలిగే మానసిక ప్రభావము దానివల్ల సంఘానికికలిగే ప్రభావము తెలపడానికి మనకుసరియైన లెక్కలు దొరకుట అసంభవము. యంత్రవ్యామోహంలేని మార్క్సు ఇలా ఈ విషయాన్నిగురించి చెబుతున్నాడు. "మనుజునియొక్క కార్మికశక్తినినశింపజేసి పాక్షికంగా యంత్రాలు అభివృద్ధిఅయితే అదిమానవాభివృద్ధిని విరోధించుటలోకూడా ప్రత్యేకత వహిస్తుంది. శ్రమయొక్క (మానవ) విలువ పడిపోతుంది."

మనుజునికున్న సహజమైన స్వతంత్రమైన సృజనాశక్తి నశించి అతడు కేవలము కర్మాగారాన్ని అంటిపెట్టుకొని వ్రేలాడే అజాగతస్తనమౌతాడు. సమష్టి ఉత్పత్తిశక్తి అభివృద్ధికావాలనే ఉత్సాహంతో వ్యక్తి ఉత్పత్తిశక్తిని తగ్గిస్తున్నాయి.

యంత్రమువల్ల సంఘానికిగలిగే ఫలితాల దౌష్ట్యాన్ని తేలికలో చెప్పడం కష్టం. యంత్రప్రవేశంతో మానవసంఘముయొక్క సుశిక్షిత

జీవనపు విపరీత ప్రభావానికి లోనైనవిషయం - నిర్వివాదము. ఈ విషయాన్ని సాంఘికశాస్త్రజ్ఞులు సాహిత్య కళాప్రియులు స్పష్టంగా వివరించారు. "గ్రేట్స్ ఆఫ్ రాత్" "హౌ గ్రీన్ వజ్ మై వేల్లీ" "ఆఫ్టర్ మెనీసమ్మర్" అనే పుస్తకకర్తలు, మోడరన్ టైమ్సు అనే సినిమాలో విఖ్యాత హాస్యనటుడు చార్లీచాప్లిన్ ప్రజల జీవనాన్ని యంత్రం ఛిన్నాభిన్నం చేసిందని చక్కగా చూపించారు. సాంఘికజీవనముయొక్క భిన్న రంగులమీద యంత్రం కల్గించిన వివిధసమస్యల్ని గూర్చిన జ్ఞానాన్ని శాస్త్రిజ్ఞులు ఎక్కువగా పొందుతున్నారు. 1937 సం॥ పు అంతర్జాతీయ వ్యవసాయ శాస్త్రిజ్ఞుల సమావేశం కూడా ఈ విషయాన్నే ఉదహరిస్తుంది.

భారత దేశ సాంఘిక చరిత్ర తెలిసిన వారికి యంత్రిమువలన సంఘంలో కలిగిన ఎగుడు దిగుడులు తెలిసివుంటాయి. భారత దేశములో గలవ్యవసాయమూ, చేతి పరిశ్రమలూ సాంఘీకార్థిక జీవనంలో సామరస్యాన్ని కలిగించాయి. పాశ్చాత్య దేశముల నుండి దిగుమతి యైన యంత్రములూ, యంత్ర నిర్మిత పరికరములూ స్వదేశ పరిశ్రమలను చంపి దేశీయ వృత్తులను చిందర వందర చేసి గ్రామీణులను పేద చేసి దారిద్ర్యాన్నీ, అజ్ఞానాన్నీ వ్యాపింప జేసినవి. అధునాతన భారత దేశమందున్న నగరములు ఇగ్లండులో పారిశ్రామిక విప్లవానంతరం తయారైన వస్తువులతో వ్యాపారం చేస్తూ ఫ్యాక్టరీ పరిశ్రమలు పెరుగుటకు కారణమైనవి. వుత్పత్తి శక్తీ, సంపదా, జనాభా మేథా సంపన్నులు అందరూ నగరములలో గుమిగూడటంచేత వీరంతా భారత ప్రజా సామాన్య క్షేమం విషయమై కొంత కొంత బాధ్యత కలిగివున్నారు. ఈ విషయాన్ని సాంఘిక శాస్త్రరీత్యా పరిశోధన చేయవలసి యున్నది. యంత్రముల వల్ల కలిగిన మంచీ చెడుల అవర్జాపట్టికలో కేవలం ఆర్థిక విషయములు మాత్రమే వివరించి వూరుకొనకూడదు. విశాలమైన దృక్పథంతో సాంఘికపు అవస్థలను కూడా మనం పరిశీలించాలి, వస్తువులను పెద్ద మొత్తంగా తేలిగ్గానూ శీఘ్రంగానూ యంత్రం వుత్పత్తి చేస్తుంది కనుక అందులో కల్తీలేని మంచి వుందనుకోకూడదు. సమిష్టి సాంఘిక

పద్ధతియే ఒక వ్యవస్థాపన యొక్క మంచి చెడులను నిర్ణయించునదిగా వుండవలెను. ఎంత మొత్తపు వస్తువులు ఎంత తొందరగా వుత్పత్తి అయినవా అని విచారించటం పెట్టుబడిదారులు చేసేపని. దురదృష్టవశాత్తు ఒక శతాబ్దం గడచిపోవడంచేత సామాజికవాద భావ పరంపరను కూడా పై దృష్టి విషపూరితము చేసినది. సామాజిక వాదం పెట్టుబడిదారీ సంస్థలను తోసివేసినది కాని అది ఏర్పరుచుకున్న గీటురాళ్ళను తోసివెయ్యలేదు.

మేము ఇంకొక ప్రామాణికుణ్ణి వుదహరిస్తున్నాం. "సంఘంలో మనిషి" అనే ఆలోచనరేపే పుస్తకంలో ప్రొఫెసర్ మానిహీము ఆధువాతన యుగమందు హేతువాదం నశించిపోవటానికి కారణం యంత్రమే అన్నాడు. యంత్రప్రవేశంలో మనిషిలోనున్న వృత్తిసంబంధమైన వివేకమే పెరుగుతుందిగాని; ప్రపంచసమస్యలయెడల అవివేకం, అజ్ఞానం ఎక్కువౌతోందని అతడు వాదిస్తున్నాడు. ఒక చిన్న వస్తువును వుత్పత్తి చేయాలంటే యంత్రము ఉపయోగించేవాడికి ఎంతో శ్రద్ధా తెలివితేటలూ కావాలి. అందువలన అతడు మిగతా వస్తునిర్మాణపద్ధతినుండి వేరై సమగ్ర ఆర్థికజీవనంయొక్క సర్వాంగపూరితచిత్రాన్ని కాంచలేకపోతున్నాడు. వేదకాలమందలి మన పూర్వులకు వర్షమూ, మెరుపూ ఎంత అద్భుతంగా కనపడేవో సామాన్య కార్మికునికికూడా సమగ్రార్థిక జీవనచిత్రం అలా కనపడుతుంది. వస్తువుల స్వరూపాన్ని గ్రహించటంలోగల ఈ అసమర్థత ఆంధవిశ్వాసాలకీ, అవివేకానికీ, 'నా విష్ణు పృధివీపతిః' సిద్ధాంతానికీ దారితీస్తుంది.

(3) ఇతరములైన ఆర్థికపు అనర్థములద్వారా జరుగు దోపిడీని నిర్లక్ష్యము చేయుట:-మనం యంత్రం విడనాడిన తక్షణమే దోపిడీవిధానమంతా ఆగి పోతుందనుకోటం శుద్ధ పొరపాటు. యంత్రంతో సంబంధంలేని అనర్థాలెన్నో ఆర్థికవిధానంలోవున్నవి. దోపిడీ అనేది రిక్షాతో ప్రారంభమై విమానంతో అంతంకావచ్చును అని ఒకాయన అన్నాడు. యంత్ర విరసనం యెడల చూపించే అంతశ్రద్ధ వీటియెడల

గాంధివాదులు చూపించ నట్లుగా కనబడుతుంది. ఇవ్వాళ గ్రామాల్లో జరిగే దోపిడీకి, యంత్రానికీ ఏమీ సంబంధంలేదు. వ్యవసాయ వస్తువుల ధరల నిర్ణయంజరిగే పద్ధతిలో రైతులు విపరీత నష్టాన్ని పొందుతున్నారు. అతి కూౢరమైన ఈ ధర నిర్ణయవిధానరహస్యాన్ని గాంధీవాదులు తరచలేరు. ఈ విధంగా రైతు ఆర్థికంగా పీడింపబడేవిషయాన్నిగురించి అధికార పూర్వక పరిశీలన లేకపోవుటచేత ఈ అనర్థానికి ఎవ్వరూ అభ్యంతరము చెప్పలేదనుకు ంటున్నారు. ప్రస్తుతం అమలులోవున్నా పూర్తిగా విమర్శించి సమగ్రమైన పరిశోధన చెయ్యాలంటే ఎంతోమంది మేధావుల తోడ్పాటును మనం పొందవలసివుంది. ఈ సందర్భంలో సామాజికవాదులు చేసే విరసన చాలా ఉపయోగకరమైంది.

ఈ సమస్యలకు తక్షణ ప్రాధాన్యంలేదు గనుక గాంధీజీ తన ఆలోచనలను వాటినిగూర్చి వ్యర్థంచేయులేదని కొందరు వాదించవచ్చును. కాని అట్టి సమర్థన సరైనదికాదు. దూదియంత్రాలను మూసివేసి వాటిస్థానే రాట్నమునుంచుటం చాలాదూరపు భవిష్యత్తుకు సంబంధించిన విషయమైన ప్పటికిన్నీ గాంధీజీ దాన్ని గూర్చి చాలాసార్లు వ్రాశాడు. రాజకీయాధికారం చేతుల్లో కొచ్చేవరకు ఈ సమస్యా పరిష్కారం అసంభవం కనక వానిని గూర్చిన చర్చ అలసత్వ ప్రదర్శనం, వ్యర్థం అని కొందరు వాదిస్తారు. కొందరికిది మానసికమైన పోచురితన చిహ్నంగా కనిపిస్తుంది. (కావాలని ఆ సమస్యని వదిలేద్దామని కాకపోయినా) ప్రభుత్వచర్య రీత్యా ఈ సమస్యా పరిష్కారం చెయ్య పూనుకోటం గాంధీగారి అహింసావాదానికి విరుద్ధం.

(4) ధర్మకర్తృత్వ సిద్ధాంతము:- సమాజ ఆర్థిక జీవన నిర్మాణంలో అతిప్రాముఖ్యం వహించే గాంధీగారి సిద్ధాంతాల్లో ఇది ఒకటి. భారతదేశంలో ఋగ్వేదం నాటినుండి, యూరపులో ప్లేటో నాటినుండీ ఆస్తిని కలిగివుండడాన్ని గూర్చి చాలామంది గాఢంగా ఆలోచించారు. సమాజం పెరిగిన కొద్దీ ఆస్తి స్వామ్యంయొక్క ప్రయోజనంలో ఏన్నో

మార్పులు వచ్చినవి. ఆ స్తివలన వ్యక్తికీ సమాజానికీ కలిగే ప్రయోజనం ఆస్థిదారునియొక్క హక్కులు, విధులూ ప్రత్యేక సదుపాయాలు— వీటిల్లో కూడా చాలా మార్పువచ్చింది. పెట్టుబడిదారీ విధాన ప్రవేశంలో సంపదను గూర్చిన భావాల్లో ఒక విప్లవకరమైన పరిణామం కలిగింది. పెట్టుబడిదారీ విధానం వుత్పత్తి రంగంలో ఎన్ని అద్భుతాల్ని సాధించినప్పటికీ సమాజంలో ఆస్తికేర్పడిన నూతన స్థితినిబట్టి దారిద్ర్యం, నిరుద్యోగం భద్రతా హీనత, సంఘంలో ఏమీ పనిచేయని ఒకవర్గం అధికారాన్ని ప్రతిష్టనీ పొందటం మొదలైన వాటికి దారి తీసింది.

నే నిదివరనే చెప్పినట్లు ఆర్థిక నిమ్నోన్నతముల యెడల గాంధీజీ దృక్పథం ప్రధానంగా నీతిశాస్త్రానికి సంబంధించినది కనుక శాస్త్రేతర మైనది. ఆయన పరిశీలన ఆయన సూచించే నివారణోపాయముల గూర్చియే గాని సంస్థలను గూర్చి కాదు. నేననేది ఈ రెంటినీ సస్థలకు విస్తరింప చెయ్యమనియే!

సంపదంతా ఒకచోట పోగుపడిన ఈ సమాజంలో జరిగే అన్యాయాన్ని నీతిశాస్త్ర న్యాయశాస్త్రములదృష్టికి తెచ్చినవారు సామాజిక వాదులు. ప్రౌధిన్ ఆస్తంతా చౌర్యం అన్నాడు. కారల్ మార్క్స్ నిశాత మైన తన ధిషణాశక్తితో ఆర్థికసమత్వం వుండి సంపద సామాజిక పరం చేయబడే ఒక విధానాన్ని సూచించాడు. 19, - 20 శతాబ్దాలలోని అభ్యుదయవాదులంతా ఈ పరిశీలన సరైనదనిపప్పుకున్నారు. కారల్ మార్క్స్ సూచించిన నివారణోపాయాన్నిగూడా ప్రధానమైన సిద్ధాంతాలలో వప్పుకున్నారు. పునః పునః దురీయమానమైన ఆర్థికదుస్థితులూ, వాటి అనివార్యపు ఫలితమైన భయంకరయుద్ధాలూ, పెట్టుబడిదారీ విధానంయొక్క మంచియందు విశ్వాసాన్నిసడలింపజేసినవి. సోవియట్ రష్యావుత్పత్తిలో సాధించిన అద్భుతవిజయాలు ఎంతోమందిని సమాజవాదాన్ని అంగీకరింపజేసినవి అతివాదులైన మేధావులంతా ఈ మార్క్స్ నివారణోపాయాల్ని మానవకోటికి తారకమంత్రంగా జపిస్తున్నారు.

గాంధీగారు ధర్మ కర్తృత్వ సిద్ధాంతాన్ని బోధించినపుడు అది మధ్య యుగాల జమీందారీ విధాన పునరుద్ధారణగా కపపడటంచేత చాలమంది మేధావులకు ఆయన మాట నచ్చలేదు. గొప్ప మతావేశంతోనూ, ధర్మాభి నివేశంతోను, ఆయన ఈ భావాన్ని ప్రచారం చేయటంచేత భారతీయుల మనసులమీద ఇది పెద్దముద్రవేసినది. ఈ విజ్ఞప్తి వారిని ఆకర్షించినది. తరతరాలనుండీ భాగ్యవంతులైనవారికి ఇవి నచ్చినవి. నడమంత్రపు సిరిగలవారికి ఇది నచ్చలేదు, నచ్చినవారు కొందరాయన శిష్యగణంలో కూడా చేరారు. విశ్వవిద్యాలయ విద్యాధికులకు అందులో ముఖ్యంగా మార్క్సిజమ్ పఠించినవారికి మహాత్ముడు కపటియైన సంఘ సంస్కారిగా కనపడ్డాడు,

అన్ని నూతనభావాలవలే ధర్మకర్తృత్వ సిద్ధాంతంకూడా ప్రారంభంలో అస్పష్టంగావుంది. 20 సం॥. పరిశీలనానంతరం దానికిఒకరూపం ఏర్పడింది. ఇప్పుడు మనము అనేక దృక్కోణములనుండి పరిశీలించవచ్చు. ధర్మకర్తయొక్క హక్కులూ, విధులూ ప్రత్యేక సదుపాయాలను గూర్చి పరిశీలించటం మనప్రథమ విధి, పెట్టుబడిదారుకూ, ధర్మకర్తలకు గలతేడా ఏమిటి? ఆస్తి సామజికపరంగా వుండటానికీ ధర్మకర్తచేతుల్లో వుండటాలికీగల ముఖ్యమైన తేడా ఏమిటి? ధర్మకర్తృత్వ సిద్ధాంతాన్ని స్పష్టీకరించాలంటే మనం ఈ ప్రశ్నలకు జవాబు చెప్పుకోవాలి.

పెట్టుబడిదారీ విధానమంటే ప్రభుత్వం యొక్క పన్ను చట్టములకు లోబడి ఆస్తిదారులు అన్నిలాభాలు పొందుతారు. (హక్కుదారుడు) సంఘానికి అవసరమైనాకాకపోయినాసంఘక్షేమజన్యమైనా కాకపోయినాఆస్తిదారు ఏపని నైనా ప్రారంభించవచ్చు. అతనికి బాగా డబ్బువచ్చే పరిస్థితిలో అతను విషవాయువును గూడా తయారు చేయవచ్చు. వుత్పత్తి విధానంలో అతనికి కార్మికులలో యిష్టం వచ్చినట్టు వప్పందం చేసుకునే స్వతంత్రత కూడా వుంది, అతను ఒక మనిషిని కార్మికునిగా నియోగించి ''వాంఛా సరఫరా" సూత్రాలు సమసరించి అతనికి జీత మివ్వ వచ్చు. ఆ వుద్యోగం చేసేవానికి సమర్థత వుండవచ్చు లేకపోవచ్చు. దానివలన కలిగే ఫలితం

అందరూ ఎరిగినదే. ఒక ప్రక్కన దారిద్ర్యమూ నిరుద్యోగమూ, జీవనా స్థిరత్వము వున్న కార్మికవర్గం, మరొక ప్రక్క భోగభాగ్యాలతో తుల తూగే కొందరు తయారౌతున్నారు. ఆర్థిక పరిస్థితితోపాటు సంఘంలో హోదా, రాజకీయంగా అధికారం వుంటుంది. ఇట్టి అన్యాయపు ఏర్పాటు సామ్రాజ్య వాదాలకీ మరల మరల సంభవిల్లె ఆర్థిక దుస్థితికీ హేతు భూత మైంది. ఈ అనర్థాలకి సామాజిక వాదులు చెప్పే నివారణోపాయం, వ్యక్తి గతాస్థి నిర్మూలనా వుత్పత్తి సాధనాలను సమాజపరం చెయ్యడం. దేశము యొక్క సమగ్ర ఆర్థిక జీవనాన్ని ఒక నిర్ణీత పథంలో పెట్టాలి. సామా జిక అవసరాల బట్టి వుత్పత్తి జరుగుతుంది. అంతేగాని వ్యక్తి లాభాల కొరకు కాదు. వర్గ భేదములు నిర్మూలించబడతాయి. ఆర్థిక సమానత్వం స్థాపింపబడుతుంది. వుత్పత్తి విధానంలో దోపిడీకి తావుండకూడదు. ఈ సిద్ధాంతాలు సమాజానికి న్యాయం కలగాలనే వున్నతా దర్శాలతో ప్రేరే పింప బడినవి. ఇవి అనుష్ఠానయోగ్యములని సోవియట్ రష్యా రుజువు చేసినదని అందరూ ఎరిగినదే. కాని, ఎవరో మూఢ విశ్వాసకులు తప్ప ఈ విధానం సిద్ధాంత భాగంలోనూ, ఆచరణ భాగంలోనూ కొన్ని అభ్యంత రాలను కలిగియున్నదన్న సంగతి ఎవరూ కాదనజాలరు. విమర్శకులు వారి కిష్టం లేని దానిని పరిశీలించేటప్పుడు ప్రతి చిన్న విషయంలోనూ పరిపూర్ణత్వ ముండాలని పదేపదే ఉద్ఘాటిస్తారు. నూత్నభావాన్ని విశాలమైన దృక్పథంతో పరిశీలించాలి. వాటిలో ఏదైనా అమూల్యములైన విషయములుంటే వివర ములకు పరిపూర్ణత్వాన్నిసాధించటంలో విమర్శకులు తోడ్పడాలి గాని, ఏదో స్వల్ప అస్పష్టత వున్నదని పొదుగుకోసివేయడానికి పూనుకోరాదు. పెట్టుబడిదారీ విధానంలోనూ, సామాజికవాద విధానంలోనూ ఆస్థిస్వా మ్యాన్నిగురించి స్పష్టంగా తెలిసినవారికి గాంధీగారిధర్మకర్తృత్వ సిద్ధాంత విలువను నిర్ణయించటానికి అర్హులు. ప్రతివ్యక్తి తాను సంగ్రహించు అర్థమునకు ధర్మకర్తనని ప్రతివాడు భావించవలెను. అతనికున్న సంపద అతని యిష్టానుసారము నిల్వచేయబడకూడదు. కనీసపు అవసరాలకన్న

12 రెట్లు మాత్రమే గరిష్టసంపదవుండాలి. ఒక్కసారే ఒక్కపరిమితిని నిర్ణయించటంకన్న ఈ పద్ధతి చాలా శాస్త్రీయమైనది. గరిష్టప్రమాణం దేశంయొక్క ఆర్థికపరిస్థితులనుబట్టి మారుతూవుంటుంది.

ధర్మకర్తృత్వ సిద్ధాంతాన్ని గురించి స్పష్టీకరించేముందు ఈ పై నిర్వచనం ఎక్కడికి దారితీస్తుందో మనం చూద్దాం. మొదట పెట్టుబడి దారువలెకాక, ధర్మకర్త తన సంపదను తన యిష్టంవచ్చినట్లు వినియోగం చెయ్యడానికిగానీ, దుర్వినియోగం చెయ్యటానికిగానీ వీలులేదు. అతని జీవనానికి కావలసినంతవరకుమాత్రమే అతను స్వేచ్ఛగావాడుకోవచ్చును. అతని జీవనగరిష్టప్రమాణం ప్రభుత్వం నిర్ణయిస్తుంది. సామాజిక విధానంలో అతని ఆస్తంతా ప్రభుత్వం జప్తుచేసుకుంటుంది, ఈ రెండువిధానాల్లో వుత్పత్తి సాధనాలు వ్యక్తి స్వాధీనంలో వుండకూడదనేదే ముఖ్యాంశం. సామాజిక అవసరములను బట్టి ఆస్తి వుపయోగం నిర్ణయింపబడాలి. ఆస్తి నిర్వహణ కూడా సామాజిక సమత్వ భావాలకు అనుగుణ్యంగా వుండాలి. 1 మొదలు 12 రెట్ల మధ్యవరకు అసమానత్వం వుండవచ్చునని గాంధీ వాదం చెబుతున్నందువల్ల అది సామాజిక సమత్వాన్ని కొంత వరకు ప్రతిపాదిస్తుంది. బస్న హేమ్ లెక్కల ప్రకారం సోవియట్ రష్యాలో జనాభాలో పైవర్గం వారిలో నూటికి 11 నుండి 12 మందికి జాతీయాదాయంలో షుమారు 50% చేరుతోంది.

లోతుగా పరిశీలిస్తే సామాజిక విధానంలో వుండే ఆస్తి హక్కుస్వభావానికి ధర్మకర్తృత్వానికీ పెద్ద తేడా యేమీలేదు. ఈ వుభయ సిద్ధాంతాల్లోనూ ఆస్థిస్వామ్యం వ్యక్తులలాభాలకోసం యితరులను దోపిడీ చేయటం ధర్మకర్త లేక మేనేజరు యొక్క యిష్టానిష్టాలనుబట్టి సంపద వినియోగించబడదు. వుభయ విధానాలలోనూ సంఘక్షేమం కోసమే సంపద అదుపులోవుంచబడుతుంది. ధర్మకర్త యొక్క హక్కులు విధులపట్టికను మనం చూచినట్లయితే అతను సామాజిక విధానంలో వుండే ఫ్యాక్టరీ మేనేజరును పోలివుంటాడు. కర్మగారాన్ని నడపటానికుండే స్వేచ్ఛ, తీసుకునే నష్టపరిహారం లోనూ ఫ్యాక్టరీ మేనేజరును పోలివుంటాడు. ధర్మ

కర్త స్వాధీనంలో వున్న ఆస్తికీ, సామాజిక పరంచేయబడిన ఆస్తికీ గల సామ్యాన్ని మనం చూచాం కనుక ఇక తేడా ఎక్కడ వుందో చూద్దాం. ధర్మకర్త స్వయం నియమిత నిర్వహకుడు. గాంధీ విధానంలో ఆస్తిదారుడే ధర్మకర్త అవుతాడు. నిర్వహణలో అతనికి సమర్థత వున్నా లేక పోయినా సామాజిక విప్లవంలో అతనిక నిర్బంధ శిబిరంలో ఉంచబడతాడు. సమర్థతను బట్టె మేనేజరు నియమించబడతాడు. లోగడ ఆస్థి వున్నప్పటికీ అది మేనేజరు పదవికి అర్హతగా గాక పాపంగా పరిగణింపబడుతుంది ఈ రెండు వాదములు సమాజాన్ని మార్చుటానికి అవలంబించే సాధనాల్లో గల తేడా ఇది. గాంధీవాదాన్ని ఊహా ప్రపంచనిర్మాణమనీ, సామాజిక వాదాన్ని పశుబల ప్రదర్శనమనీ తోసివేసినందువల్ల ప్రయోజనం లేదు. కొంత ఆలోచనా సంబంధమైన నిరీహ్యాభావ ముంటేనేగాని ఈ రెండు పద్ధతులయొక్క విలువను మనం కట్టలేము ఈ వుభయవాదముల యొక్క పరస్పర విలువను నిర్ణయించడంలో "విప్లవ" శాస్త్రాన్ని గురించి మన కున్న జ్ఞానమంతా వుపయోగపడాలి.

గాంధీగారు ధర్మకర్తృత్వ సిద్ధాంతాన్ని ఎన్నుకోవడంలో ఆర్థిక కారణములను పురస్కరించుకొని గాక సమాజంలో మార్పుతీసుకొని రావడానికి ఆయన ఉపయోగించే పద్ధతులనే అనుసరించి వున్నది. ఆయన అహింసా వాదానికి అనుగుణ్యంగా దుర్మార్గునికి ఒక అవకాశం ఇస్తాడు. ఆ తరువాత గాని ఆయన వానిని వెళ్ళిపోవలసిందని గానీ, నిర్బంధ శిబిరంలో ఉంచడానికిగానీ అంగీకరించడు. జమీందారులు పెట్టుబడిదార్ల యొక్క దోపిడీ విధానాన్ని గాంధీజీ దాపరికం లేకుండా తీవ్రంగా నిరసించాడు. వాళ్ల దుష్టప్రవర్తనయెడల మనము క్రోధోద్రిక్తులమై వారిని పూర్తిగా నిర్మూలించదలుస్తాం. అహింసాపద్ధతి ప్రకారం మధ్య మనమొక గంతు దాటేస్తున్నాము దుర్మార్గుని పరిహరించేముందు దుర్మార్గాన్ని పరిహరించడానిక్కి ఒక ప్రయత్నం జరగాలి. అందుకనే గాంధీగారు జమీందారుల్ని పెట్టుబడిదారుల్ని తమ ఆస్తులకు ధర్మకర్తలగా వుండమని కోరుతున్నాడు. 'వాళ్లకు సమ్యక్పథం చూపించు నీ విధానములో గల

న్యాయాన్ని వారికి నచ్చజెప్పు. తమ్ము తాము సంస్కరించుకొనే అవకాశం 'వారి కియ్యి.' ఈపద్ధతి జయప్రదమైతే అధర్మం అంతమై లోకానికొకయోగ్యుడైన ఒక పౌరుడు లభిస్తాడు. భావార్థకంగా చెప్పాలంటే ఒక శత్రువు తగ్గుతాడు. నిర్దాక్షిణ్యంగా అస్తంతా జప్తుచెయ్యాలనే వాదం విప్లవ ప్రతిఘాతక నిర్మాణాన్ని ఆహ్వానంచేస్తుంది. ప్రపంచ విప్లవ చరిత్రానుభవం ఏమిచెపుతుందంటే విప్లవ విజయంకన్నా విప్లవ ప్రతిఘాతకుల విధ్వంస కార్యక్రమాన్నే ఎదుర్కోటమే కష్టమని చెబుతోంది. అహింసాత్మక విప్లవం దీనికన్నా మంచి వాతావరణంలో పెరిగింది. విప్లవ విజయాల్ని పాడుజేసే హింసాద్వేషములను అది ప్రకోపించదు. ఈ పద్ధతితో విప్లవానంతర పునర్నిర్మాణం కూడా సులభసాధ్యమవుతుంది. తక్కువ ప్రజాద్రోహ విచారణలు జరుగుతాయి. అది హృదయ పరిణామాన్ని తీసుకొచ్చేపద్ధతి. కాని ఈ పద్ధతివల్ల జయంపొందలేకపోవచ్చు. అప్పటికీ మించిపోయిందేమిలేదు. ధర్మకర్తను పదభ్రష్టుణ్ణి చేయవచ్చు. ఎందుకంటే మనం అహింస అన్యాయాన్ని సహించము. గాంధీగారి పద్ధతి ప్రకారం ఈ పదవీ భ్రష్టత్వం చేయుటకూడా సంఘం యొక్క బలంతో చేయాలిగాని ప్రభుత్వం యొక్క బలంతోగాదు. తక్షణమే ఆస్థిదారులనందర్నీ అణగదొక్కవేద్దామనే పద్ధతి శీఘ్రఫలితాలనివ్వదు. సోవియట్ రష్యాలో 1939 వరకు (విప్లవానంతరం 20 సం॥రాల వరకు) దేశద్రోహం విధ్వంస కార్యక్రమం అనేక కష్టాలు కలిగిస్తున్న సంగతి పైవాక్యములకు నిదర్శన. ప్రభుత్వబలం కన్న సంఘబలమే ఉపయోగించాలన్న ఈ వాదం గాంధీగారి అహింసాపద్ధతిని నుండి జనించినదే. ఈ సందర్భంలో గాంధీగారి దృక్పథం నిర్మిత ప్రభుత్వాలయెడల అవిశ్వాసాన్ని ప్రకటించే అరాజకవాదులస్థితినిబోలినది. ఇందులో తక్షణాదర్శాలకు అంతిమాదర్శాలకు సంఘర్షణ వుండదని కొందరు వాదిస్తారు. ప్రభుత్వం దానంతట కదే నెమ్మదిగా అంతర్హిత మౌతుందనీ, ప్రారంభంలోనే దాన్ని త్రోసి రాజనడం, బాధ్యతారహితమైన ఊహాగానమనీ కొందరు వాదిస్తారు. అహింసాత్మక విప్లవంలో మనం అధికారాన్ని

లాక్కో్ేము, అది ప్రజలకు క్రమంగా సంక్రమిస్తుంది. కనుక సంధి యుగంలో నియంతృత్వాధికారము వుండనవుసరములేదు. విప్లవం పరిపూర్ణ విజయం పొందేటప్పటికి సంఘము తన చట్టములను అమల్లోవుంచగల్గే అంత బలాన్ని సంపాదించుకొని వుంటుంది అని గాంధిగారు పైవాటికి సమాధానంచెబుతున్నారు. అహింసాపద్ధతి ప్రకారం "చెట్టుమీదనే కాయ (నూతనవ్యవస్థ) పండాలి" పచ్చిగావున్నప్పుడే ఆ కాయను నీవు కోసినట్లయితే దానిని నీవు కృత్రిమఉష్ణం (ప్రభుత్వపు జులుము) లో వుంచాలి. విచ్ఛేదనాకార్యక్రమం ఇందులో ఏదీలేదు. పునర్నిర్మాణ కార్యం వెంటనే ప్రారంభమవుతుంది. విప్లవానంతరసంఘం దౌర్జన్య విప్లవానంతర సమాజంకన్న అభ్యుదయ స్థితిలో ఉంటుంది. అధికారాన్ని బలవంతంగా లాక్కోము గనుక విప్లవ విజయాన్ని విదేశస్థులనుండి-విప్లవ విద్రోహులనుండి రక్షింపనవుసరంలేదు. అవసరమైన దౌర్జన్యాన్ని కూడా మనము ఉపయోగించం గనుక చికిత్సావసరం కూడా లేదు.

ఈ పద్ధతివల్ల విప్లవకరమైన మార్పు వస్తుందా రాదా అన్న విషయాన్ని ఒకరు నమ్మవచ్చు నమ్మకపోవచ్చు. కాని ఎందువల్ల గాంధీగారి నూత్న సమాజ నిర్మాణ విధానంలో ప్రభుత్వాధికార శక్తుల మీద ఆధార పడదో తెలుసుకోవచ్చును.

**(5) అహింసాత్మక సంఘం యొక్క ఆర్థికనిర్మాణం:** గాంధీగారు చెప్పే ఆర్థికవాదం గాంధీగారి అహింసమీద ఆధార పడిన సాంఘిక తత్వశాస్త్రాన్ని ప్రతిబింబింపజేస్తుంది. ఆయన దృష్టిలో అహింసాత్మక సంఘమే నిజమైన ప్రజాస్వామిక సంఘం. ప్రాశ్చాత్య ప్రజాస్వామికం పరాజయం పొందిందంటే దానిసంస్థలలోని లోట్లవల్ల కాక అహింసాసాధనాన్ని అది అవలంభించక పోయినందువల్లనేనని గాంధీగారు నమ్ముతున్నారు. ఈ ప్రధాన సూత్రాన్ని నిర్లక్ష్యం చేసినందువల్లనే రాజకీయ దోపిడీ, ఆర్థిక అసమానత్వం అనివార్యంగా ఏర్పడుతున్నవి. సత్య ధర్మ స్థాపనకోసం దౌర్జన్యాన్ని వదలకపోయినందువల్లనే ప్రజాస్వామ్యం నిరం

కుశత్వంగా పరిణమించింది. విదేశాలలో సామ్రాజ్యవాదంగానూ, స్వదేశంలో ప్రజాసామాన్యానికే కొనుగోలుశక్తి తగ్గించేదిగానూతయారైంది. సామాజికవాదులు సామాజికవాదంలేనిదే సరైన ప్రజాస్వామికంలేదని చెబుతున్నారు. గాంధీగారు ఇంకొక అడుగు ముందువేసి సరైన ప్రజాస్వామికంగానీ; సామాజికవాదంగానీ, అహింసాత్మక సంఘంలోతప్ప మరెక్కడా వుండవంటున్నాడు, ప్రజాస్వామికం, సామ్రాజ్యవాదంలేనిదే అహింస పట్టి ప్రహసనమని ఎవరైనా భావించవచ్చు. కాని ఒకప్రవక్తకు వుండే నిర్మలదృష్టితో పురాతన ఆద్యతను సాంఘిక నిర్మాణ వ్యూహా ప్రపంచాల్లోవుండే ప్రధానమైనలోటును గాంధీగారు కనిపెట్టారు. 17 వ శతాబ్దపు పెట్టుబడి విధానానికి మార్క్సు ఒక విరుగుడు కనిపెట్టాడు. 20 వ శతాబ్దపు పెట్టుబడిదారీ విధానానికీ, నియంతృత్వ విధాన రాజ్యాలకీ (రామబాణమందు) ను గాంధీగారు కనిపెట్టి నిర్ణయించారు. సామాజిక వాదంతోనే వాస్తవిక ప్రజాస్వామికం సిద్ధించదు. కర్మవీరుడై కర్మ సన్యాసంచెయ్యకుండా ప్రేమవిశ్వాస పరిపూర్ణుడైన ఒక అపూర్వమానవుని సహకారంతో మాత్రమే వుత్తమ ప్రజాస్వామికం సిద్ధిస్తుంది.

అనేక కారణాల్నిబట్టి ప్రస్తుతమున్న సంఘంకన్న రాబోవు అహింసాత్మకసంఘం నిరాడంబరముగా వుండవలసియుంటుందని గాంధీజీ విశ్వసిస్తున్నాడు. సామాన్యమానవునికి అర్థంకానంత విశాలమైపోయింది ప్రపంచం. తన అజ్ఞానాన్ని కప్పిపుచ్చుకోవడానికి సామాన్య మనుజుడు పరుల అభిప్రాయాలను ఆమోదిస్తున్నాడు. ఈ అభిప్రాయాలను నిర్మించి విక్రయించేవారు వాటికి మార్కెట్టులో చెల్లుబడివుంటానికి వాటికి స్వీకారార్హములయినపేర్లు వుంచుతున్నారు. అందుకనే చాలామంది ఆధునిక ప్రపంచయొక్క ఆడంబరం తగ్గాలంటున్నారు. ఈ ఆడంబరత్వము వైజ్ఞానికులకు పెట్టుబడిదార్లకు గర్వకారణముగా వుండవచ్చు. కాని అది ప్రజా సామాన్యాన్ని దాస్యంలోను అజ్ఞానంలోనూ వుంచుతుంది.

ఈ రోజువారీ ప్రపంచం సామాన్యమనిషికి అర్థమయ్యేదిగా వుండాలి. దాని వలయానికి ఒకహద్దువుంచే దానిలో వాడు విహాసంగా

బ్రతుకుతాడు. దుర్మార్గాన్ని వీర్యవంతంగా ప్రతిఘటిస్తాడు. ఈ రోజున అతడు నియంతలయొక్కయు మామూలురాజకీయోపన్యాసకులయొక్కయు చేతులలోవున్నాడు. కొలది సందర్భాలలో అతడు పోరాటంలో దిగుదామను కొన్నపుడు గాలిమరతో పోట్లాడిన "డాంక్విక్సోట్" ను స్మరణకు తెస్తున్నాడు.

గాంధీగారు నిర్మించదలచుకొన్న అహింసాత్మసంఘం ప్రపంచపు హద్దుల్ని సామాన్యమనిషికి సమీపంగా తీసుకువస్తుంది. అతని జీవితానికి అతిప్రాముఖ్యమయిన విషయాలలన్నిటినీ స్థానిక పరిసరాల్లోకి తీసుకురావటానికి ప్రయత్నిస్తుంది. అతనికి క్షేమకరమయినవాటిని అతని మానసికదృష్టిపథపరిసరాల్లోకి తీసుకువస్తుంది.

అప్పుడే అతడు తన్నుతాను పరిపాలించుకోగల్గి యదార్థ ప్రజాస్వామికాన్ని పొందగల్గుతాడు. అతని జీవితాన్ని దిద్దితీర్చేవస్తువులమీద అతనికి ఆధిపత్యం లేనంతవరకు స్వరాజ్యమనేది కేవలం భ్రమజనితం. సామాన్యమానవుడికి ఈ గ్రహణశక్తి లేకపోవడంచేత అధికార పిపాసామత్తులగు జాతులు, వ్యక్తులు, సమితులు అతని పరిపాలనా బాధ్యతవహిస్తానికి ప్రలోభ పడుతున్నవి. ఒకసారి పరిపాలిస్తానికి వచ్చినవారు శాశ్వతంగా అలాగేనిల్చిపోయి నిష్కామయోగాన్ని వదిలి వేస్తున్నారనేది చరిత్రానుభవం చాటుతున్నది.

నూతనంగా కనిపెట్టబడిన ఈ యంత్రాలు వర్తకులకూ, రాజకీయవేత్తలకూ కావలసినన్ని రంగములను తెరపించి సామాన్యమనుష్యునకు ఈప్రపంచాన్ని అర్థంకాకుండాచేసినవి. ఖండాలనూ ఖండాలనూ కలిపినటువంటి రైల్వేలూ, నావలూ, సామాన్యమనిషియొక్క మానసిక వికాసాన్ని మంచుతెరలతో, ముసుగుతో కప్పివేసింది. అవి అతన్ని అనేక తుపానులకు లోనుచేసి నిర్దయులకో వివేకంలేనిపుత్సాహవంతుల కోఅప్పజెప్పినవి. ప్రవీణులుపరిపాలించాలా, అధికారవాంఛాపరులు పరిపాలించాలా అనేదే నేటి సమస్య. రెండవవర్గంవారే నేడు అధికసంఖ్యాకులుగా వున్నారు. గాంధీగారు సామాన్యమనుష్యుని ప్రపంచం చిన్నదిగా వుండాలని కోరుతున్నాడు.

అంటే ఆయన అభిప్రాయం సామాన్యమానవుడు బీదవాడుగానూ, అనాగరికుడుగానూ వుండి, విదేశవస్తువుల భోగములను అనుభవించవలదని కాదు. ఈ రోజున ఒక దేశానికీ ఒక దేశానికీ రాకపోకలూ, రవాణా సాగుతూన్నప్పటికీ సామాన్యమనుజునకు నాగరికతగానీ, కలిమిగానీ లేదు. అందుకనే గాంధీగారు సామాన్య మనుష్యుడు నిర్ణీత పరిసరాల్లో నివసించి వికాసంగా బ్రతుకుతూ మానవకోటి రక్షకులమని ముసుకువేసుకున్న ప్రపీణుల యొక్కయు అధికార వాంఛాపరుల యొక్కయు కుటిల నీతి నుండి రక్షింపబడాలని కోరుతున్నాడు. దేశవైశాల్యం - తక్కువస్వాతంత్ర్యాన్ని, తక్కువ చొరవ తీసుకొనే శక్తిని మాత్రమే కలిగిస్తుంది. ఆర్థికదృష్టితో ఆలోచిస్తే విశాల ప్రపంచం లాభకరమైనదే. వస్తూత్పత్తి కుంటువడిన రోజుల్లో ఈ ఆర్థిక ఆదర్శము అభ్యుదయ కరమైనదే. కాని వుత్పత్తి శాస్త్రం పెరిగి వస్తూత్పత్తియొక్క ఇతోధికత్వం సంభావ్యమైన ఈ యుగంలో కేవలభౌతిక పదార్థాల సరఫరాకాక మిగతా విషయాలను గురించి ఆలోచించటంలోనే అభివృద్ధి యిమిడివున్నది. మార్క్స్ జీవించియున్నరోజుల్లో అధిక వస్తోత్పత్తి సమస్య పరిష్కరింపబడి యుండలేదు. ఆదిగాక అతడు ప్రజాసామాన్యానికి భోగభాగ్యాలుండాలనికోరాడు. గాంధిగారు సామాజికవాదం ప్రతిపాదించిన సమత్వ సిద్ధాంతాన్ని ఆమోదించారు. ప్రతివానికీ వుదారవంతమైన ఒక కనీసజీవన పరిమాణ ముండాలని ఆయన కోరతాడు. కాని ఆయన మానవసౌఖ్యాన్ని భౌతికపదార్థ సంచయ స్వామ్యమనే కొలతబద్దతోకాక ప్రతివ్యక్తిఅనుభవించే యదార్థస్వాతంత్ర్య శీలోపలంతో మాత్రమే కొలుస్తాడు. మనిషికి స్వేచ్ఛావివేకాల్ని నాశనం చేసేటట్లయితే అధిక వస్తోత్పత్తికోసం ఏమనిషీ పనిచేయనక్కరలేదంటారు గాంధీగారు. రాజకీయ ఆర్థిక స్వాతంత్రములే సరిపోవు. రాజకీయ పక్షాలు, నాయకులూ యిచ్చే వస్తువుగా మాత్రమేస్వేచ్ఛ అనేది వున్నట్లయితే దానికి విలువ లేదు. మన పౌరజీవనంయొక్క ధార్మికతత్వ పునాదిగా స్వేచ్ఛవుండాలి. తమకు అర్థంకాని నిర్మాణంకల సంఘంలో నివసించే మనుష్యులు స్వేచ్ఛననుభవించలేరు. అలాంటిసంఘంలో దారిద్ర్యం.

దోపిడీలేకపోయినప్పటికీ ప్రవీణులగు రాజకీయనాయకుల మేథస్సుమీద ఆధారపడి వుంటుంది. కనుక ఆ స్వతంత్రాన్ని మానవులు అనుభవించలేరు. గాంధీగారి చిన్న ప్రపంచంలో సామాన్యమానవుడు ధీశాలుర విషకౌగిటి నుండి మొదటిసారిగా బైటపడి స్వేఛ్ఛా స్వాతంత్ర్యాల ననుభవిస్తాడు. ఆర్థికరంగంలో పల్లెల విపణిశాలల చుట్టూవున్న కుడ్యాలను నాశనంచేసి ఈ అర్థంకాని వైశాల్యాన్ని నిర్మించారు ధీశాలురు. ప్రపంచపు టంగడులు వుద్భవిల్లినవి. పృథివియొక్క ఒక కొనను వుత్పత్తిఅయిన వస్తువులు మరొకకొననుఅమ్ముడగుచున్నవి. రైతులు తమతమప్రాంతాల లోనే దిగడిపోయారుగాని ధరలు విశ్వజనీకములైనవి. వుత్పత్తి శాస్త్రం అభివృద్ధి అయినందువల్ల సంఘాభివృద్ధి కుంటుపడి మతిలేని ఆశగల పెట్టుబడిదారుల దోపిడీవిధానం సాగి ప్రపంచప్రజాసామాన్యానికి అంతులేని పీడనను కలిగించినవి. ఈ విషాదాంత దృశ్యానికి మార్క్సు కన్నీరు కార్చి వుత్పత్తిసాధనాలు సమాజపరం చెయ్యబడాలనీ, వ్యక్తిలాభాల కోసం అవి వుపయోగపడకూడదనీ ప్రజాసామాన్యోపయోగానికి అవి అందుబాటులో వుండాలనీ సూచించాడు. ఇప్పుడు ఇదిచాలా లాభసాటిగా వున్నా సమాజపరం చేయబడిన ఆర్థిక ప్రపంచంకూడా సామాన్య మానవుని గ్రహణశక్తికి అతీతంగావుంటుంది. స్వప్రయోజనాన్ని కాంక్షించే పెట్టుబడిదారులకు బదులు వుద్యోగపదవిలోనున్నవారు తయారౌతారు. ఆర్థికంగా ప్రజాసామాన్యం బాగుపడొచ్చు కాని రాజకీయోద్యోగుల దయాధర్మ భిక్షలమీద ఆధారపడి అస్వతంత్రంగావుంటుంది. ఇతరులు శాసించిన ప్రకారమే వారు వుత్పత్తిచేస్తారు. క్రొత్తయజమానులు ప్రాతవారి కన్నా మంచివారే అయినా వారు "యజమానులు" ఈ క్రొత్త విధానాన్ని కార్మికనియంతృత్వమని వారు పిలుస్తారు, ప్రధానమైన రాజకీయ ఆర్థిక న్యాయాలలో ప్రజాసామాన్యం వారినుండి ఆజ్ఞలు స్వీకరిస్తుందిగాని, తాము ఆజ్ఞలనిచ్చేస్థితిలో వుండదు. అట్టి ఆవలంబనం స్వతంత్రం కాదు.

గాంధీగారివిధానంలో విపణిశాలలు గ్రామాల్లోనేవుంటవి. వుత్పత్తిదారులు స్వేఛ్ఛను తిరిగిపొందుతారు. ఈ సూత్రానుసారం వుత్పత్తిదారుని

అంగడిగాని, అదృష్టంమీద ఆధారపడిన వ్యాపారస్తునియొక్కయు, పెట్టుబడిదారునియొక్కయు, ప్రభుత్వోద్యోగునియొక్కయు అంగడికాదు. కాని అమ్మబడే ప్రధానమైన వస్తువులు సామాన్యమానవులు మానసికంగా అర్థం చేసుకోగల ప్రాంతం లోపల మాత్రమే తయారౌతవి. ఈప్రాంతం యొక్క అవధిని ఎవ్వరూ నిరంకుశత్వంగా నిర్ణయించనక్కరలేదు. సామాన్య మానవునికి అందుబాటులో వుందా లేదా, అనే సిద్ధాంతమే నిర్ణయిస్తుంది. వాళ్లు వుత్పత్తిచెయ్యడమేకాకుండా, చేసే పరికరాన్ని కూడా తయారుచేస్తారు. ఇతరులు సలహా యివ్వవచ్చునుగాని అంతిమ నిర్ణయం వారిచేతుల్లోవుంటుంది. వుత్పత్తి సాధనాలమీద హక్కు వారికే వుంటుంది. ఆ సాధనములు వుత్పత్తిదారునకు కొనేవానియొక్కయు, స్వాతంత్ర్యాన్ని హరిస్తూ వస్తుబాహుళ్యాన్ని సృష్టిస్తామని అభినయించే పైశాచక కర్మాగారమూ, రాక్షసయంత్రాలూకావు. అవి తక్కువవుత్పత్తి చేస్తవనేమాట వాస్తవమే కాని వుత్పత్తిచేసే వుద్దేశం లాభంకోసంగాని అధికారంకోసంగాని కాదు. వాటి వుత్పత్తిశక్తి ఎక్కువచేయుట యదార్థమే. సామ్రాజ్యాలను స్థాపిద్దామనే ఆశకూడాఅంతే. తక్కువ పని వాళ్ళకు తామెందుకు పనిచేస్తున్నామో తెలుస్తుంది. వారికీవిషయాన్ని పై అధికారులు చెప్పనక్కరలేదు కావలసింది స్వతంత్రమా లేక కలిమియా ? ఆకలితో కృశించేవారు రెండవదానినే కోరుకోవచ్చు. కాని కాలక్రమేణా స్వతంత్రంలేని కలిమి క్రొత్త ఆకలిని సృష్టిస్తుందని వారు తెలుసుకుంటారు.